# బ్రహ్మ సూత్ర సంగ్రహం






ఓమ్.

పరబ్రహ్మణే నమః.

# భగవద్బాదరాయణ మహర్షి ప్రణీత

# శ్రీమచ్ఛారీరక మీమాంసాశాస్త్రంబునకు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శంకర భగవత్పాద

విరచిత భాష్యానుసారంబుగ

సకల ముముక్షు జనానంద కరంబగు నటుల

రాయబహదర్ శ్రీమద్వల్లూరి జగన్నాథరావుపంతులు,

ఫెల్లో ఆఫ్ ది యూనివెర్సిటి ఆఫ్ మద్రాసుగారిచే

రచియింపఁబడిన

# అధికరణార్థ కందమాలా సహిత

# బ్రహ్మసూత్రార్థ సంగ్రహము

విశాఖపట్టణ స్థిత

శ్రీ శారదాముకుట ముద్రాక్షరశాలయందు

ముద్రింపింపఁ బడియె.

౧౮౯౮ సంవత్సరము నవంబరు నెల.



VIZAGAPATAM:
Printed by A. VENKATAREDDI, at the S. S. M. Press.

ఓమ్.

---

# ఉపోద్ఘాతము.

---

శా॥ శ్రీమాయాశ్రయుఁడై చరాచర జగత్సృష్టి స్థితి ధ్వంస లీ।
లామాత్రంబునఁ జేయు నెవ్వఁడు మహాశక్తిజ్ఞతల్ మీర ఋ।
క్సామాధర్వ యజుశ్శ్రుతుల్ సులభనిశ్వాసంబు లెవ్వాని కా।
భూమానందమయు న్నిరామయుని నేముక్త్యర్థినై గొల్చెదన్॥

మున్ను నాచే రచియింపఁబడిన శ్రీమదాంధ్రశారీరకమున కిది యనుబంధము. అందు బ్రహ్మసూత్రముల కద్వైతమతానుసారముగఁ దేటతెలుగున వ్యాఖ్య యొనర్చితి. ఇపుడు తత్సారమును సంగ్రహించి సూత్రార్థ కందమాలా సహితముగ ముముక్షులకు నిత్యపారాయణోపయుక్తమగునటులఁ బ్రచురింపఁ దలచినాఁడ. శ్రీమద్గీతాది పారాయణమువలె సూత్రపారాయణము నంతగాఁ గానము. తదర్థదురవగాహత్వమె యిందునకుఁ గారణమని నేనెన్నిద. ఈకొఱత నివారించుటకును సర్వహిందూమతాధారమా బ్రహ్మసూత్రార్థమును నాశక్తికొలఁది దేశభాషను బహుభంగుల వ్యాపింపఁజేయుటకును, "బ్రహ్మసూత్రార్థసంగ్రహము" ను పేరిట నీగ్రంథమును రచియించితి. ఇందలిపద్యములు పెక్కులాంధ్రశారీరకమున నధికరణశీర్షికలుగ నున్నవియె. వానిం బ్రకృతానుసారముగఁ గొంతమార్చి యందలి లోటులఁ బూర్తిపరచి సూత్రార్థస్మృతిదార్ఢ్యమునకై యిందు మరలఁ బ్రచురించెద. ఆంధ్రశారీరకమును ముందు పఠించినవారి కీగ్రంథము మిగులనుపయుక్తము. అట్టివారే దీనికి ముఖ్యాధికారులు. సూత్రపరిష్కృత విషయముమాత్ర మిందుఁ దెలియుఁగాని తదంగములన్నియు విశదములు కావు.

పాదారంభమునఁ దదంతర్గతాధికరణ స్మరణమునకయి ప్రత్యేక పద్యముల రచియించినాఁడ. సూత్రార్థ పద్యరచనయం దీక్రింది నియమముల సాధ్యమగువరకవలంబించినాఁడ:—

## ఉపోద్ఘాతము.

౧. సూత్రాక్షరములను దద్విషయ వాక్యార్థమును గూడినదనుకఁ బద్యమున నిమిడిచి నిరర్థకపదములఁ బ్రయోగింపకుండుట;

౨. జ్ఞాపక సౌలభ్యమునకై సూత్రార్థమును గందపద్యములలోఁ గూర్చుట.

శా॥ శ్రీవల్లూరి మహాన్వవాయుఁడ యజుర్వేదిన్ నియోగిన్ శుచిన్।
శ్రీవత్సాంకబుధాగ్రగణ్యసుతుఁడన్ శ్రీమజ్జగన్నాథరా।
డ్వ్యాపఖ్యాతుఁడ సాంప్రదాయికుఁడ నేపారాశరుండన్ జగ।
జ్జీవబ్రహ్మపదార్థతత్త్వ విలసజ్జిజ్ఞాస నాకొప్పఁగాన్॥

కం॥ రచియించికందమాలఁగఁ।బ్రచురించితిబ్రహ్మసూత్రవాక్యసుమములన్
రుచిరంబై యీకబ్బము। పచరించుంగాత ధాత్రిబ్రహ్మావధిగాన్॥

చం॥ కలియుగ వత్సరాలయిదిఁకన్ జనఁ బంచసహస్ర సంఖ్య యాఁ।
గెలసిననూటయాఱిఁకను గ్రీస్తుశకద్విసహస్రసంఖ్యయా।
సల జయనామవత్సరపుటాశ్వయుజంబున నీప్రబంధమున్।
వెలయఁగఁ జేసితిన్ బొందలు వేడ్కఁ విశాఖునిపట్టణంబునన్॥

కలియుగాది ౫౦౫౫ సం॥ క్రీస్తుశకము ౧౯౫౪ సం॥ అక్టోబరు తేది.
జయనామసం॥ ఆశ్వయుజశు ౧౦ జయవారము. విశాఖపట్టణము.



# బ్రహ్మసూత్రార్థ సంగ్రహము.

## ప్రథమాధ్యాయము. ప్రథమపాదము.

క॥ జిజ్ఞాస్యుఁ జన్మకారణుఁ। బ్రజ్ఞాపక శాస్త్రయోనిఁ బరిపూర్ణునకు।
బ్జిజ్ఞేశు రసమునంతరుఁ। బ్రజ్ఞాంబరుఁ బ్రాణుదీప్తివజ్రిన్ గొల్తున్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౧॥ జిజ్ఞాసాధికరణము. | ౧॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥ | సాధనచతుష్టయ సంపత్త్యనంతరము కర్మఫలము లనిత్యములనియు బ్రహ్మము నిత్యానందస్వరూపమై ప్రాప్యముగనున్నదనియుఁ దెలియును గాన బ్రహ్మవిచారము కర్తవ్యము. | సాధనచతుష్టయోర్ధ్వము।<br>బాధితములు కర్మజన్య ఫలము లటంచున్।<br>బోధమగుఁగాన బ్రహ్మవి।<br>శోధకజిజ్ఞాసవలయు శుద్ధుల కెల్లన్॥ |
| ౨॥ జన్మాద్యధి॥ | ౨॥ జన్మాద్యస్య యతః॥ | ఈప్రపంచమునకు సృష్టిస్థితి భంగములు దేనినుండి కలుగునో యదియె బ్రహ్మము. | ఎవ్వని సంకల్పముచే।<br>నివ్వనజభవాండభాండమింపారంగా।<br>నివ్వటిలి పెరిగి లయమగు।<br>నవ్వేదోదితుఁడె బ్రహ్మమాత్మయు నవ్వే॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| ౩॥ శాస్త్రయోనిత్వాధి॥ | ౩॥ శాస్త్రయోనిత్వాత్॥ | సర్వార్థ ప్రకాశకమయిన వేదమును బుట్టించుటవలన బ్రహ్మము సర్వజ్ఞమును సర్వకారణమును— ఒండె— శాస్త్రప్రమాణమువలన బ్రహ్మమె జగజ్జన్మాది కారణము. | విశ్వార్థప్రచురములై। విశ్వవిభాజకములైన వేదము లేస। ర్వేశ్వరునకు లీలాగతి। నిశ్వాసము లట్టివాఁడు నిఖిలజ్ఞుండౌ॥ సగుణాత్మకమగుబ్రహ్మము। జగదుదయస్థితివినాశజనకంబనుచున్। నిగమప్రమాణపుంజం। (కృత్॥ బగణితముగ నుడువు. నిలువ వనుమానో |
| ౪. సమన్వయాధికరణము. | ౪॥ తత్తు సమన్వయాత్॥ | బ్రహ్మమునకుశాస్త్రప్రమాణకత్వము లేదనుమాట యయుక్తము. షడ్విధ లింగములచే శాస్త్రమును జక్కఁగానన్వయించుటవలనఁ బూర్వోక్త లక్షణములు గల బ్రహ్మము శాస్త్రప్రమాణము కలదని తెలియవచ్చును. | భువనోత్పత్తిస్థితి లయ। (1)భవమై సర్వజ్ఞమైన బ్రహ్మము కలదం। చవగమ్యమగు నిగమముల। నవిషడ్విధలింగముల సమన్వితములుగాన్॥ |

(1) కారణము.

| | | | |
|---|---|---|---|
| | | ఒండె— బ్రహ్మమునకు శాస్త్రప్రమాణకత్వము లేదనుమాట యయుక్తము. వేదాంతతాత్పర్యనిశ్చయమువలన నఖండమగు బ్రహ్మము శాస్త్రప్రమాణము కలదని తెలియవచ్చును. | సత్యము జ్ఞానమనంతము।<br>నిత్యము నిష్కల్మషమును నిరుపాధికమున్।<br>(1) శ్రుత్యుదితము నైకాత్మ్య।<br>ప్రత్యయసారము నఖండవస్తువును వేఁ॥ |
| ఈక్షత్యధికరణము. | ౫॥ ఈక్షతేర్నాశబ్దం. | సాంఖ్యపరికల్పితమగు ప్రధానము జగత్కారణము కాదు; ఆజగత్కారణము నకీక్షణము "తదైక్షత" ఇత్యాది శ్రుతియందుఁ జెప్పఁబడి యుండుటవలనఁ బ్రధానము వేదశబ్దావాచ్యము. | ఈక్షిత్యాదికవిశ్వం।<br>బిక్షితమై సృష్టియగుట; నీక్షణకృతికిన్।<br>మోక్షముగలుగుట; సుప్తదు।<br>సాక్షింబొందుటను; సత్తశబ్దంబగు నే॥<br>౫। ౬। ౭ సూ॥ |
| | ౬॥ గౌణశ్చేన్నాత్మశబ్దాత్॥ | ఈక్షితృత్వమౌపచారికమంటివేని శ్రుతియందు 'అనేనజీవేనాత్మనా' యని యాత్మశబ్దప్రయోగ ముండుటవలన నది సంభవింపదు. | |
| | ౭॥ తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్॥ | సత్పదార్థమందభేదజ్ఞానము కలవానికి మోక్షప్రాప్తియగునని "అథసంపత్స్యే" | |

(1) శ్రుతి- ఉత్ - ఇతం.

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | | యనుచో నుపదేశింపఁబడుటవలన నాత్మశబ్దమచేతనమగు ప్రధానపరము కాఁజాలదు. | |
| | ౮॥ హేయత్వావచనాచ్చ॥ | సచ్ఛబ్దవాచ్యము హేయముగాఁ జెప్పఁబడకపోవుటవలనను, అది ప్రధానము కాఁజాలదు. | |
| | ౯॥ స్వాప్యయాత్॥ | సచ్ఛబ్ద సమానార్థకమగు నాత్మయందు జీవునకు సుషుప్త్యవస్థలో లయము కలుగుచుండుటవలన సచ్ఛబ్ద వాచ్యము ప్రధానముకాఁజాలదు. | |
| | ౧౦॥ గతిసామాన్యాత్ | జగత్కారణావబోధక శ్రుతుల తాత్పర్యమునకు సమాన భావము కలిగి | శ్రుతిగతిసమతన్ శ్వేతా। శ్వతరోపనిషత్తునందు సద్వాచ్యంబే। |

| | | | |
|---|---|---|---|
| | ౧౧॥ శ్రుతత్వాచ్చ॥ | యుండుటవలనఁ బ్రధానము జగత్కారణముకాదు.<br>సర్వజ్ఞమగు బ్రహ్మమే జగత్కారణమని శ్వేతాశ్వతరమున వినఁబడుటచే నచేతనమగు ప్రధానము జగత్కారణము కాదు. | శ్రుతమైయుంటన్, దద్దే।<br>యతవినరామిఁ,బరుడెజగదారంభకుడౌ॥<br>౯, ౧౦, ౧౧ సూ॥ |
| ౬॥ ఆనందమయాధి॥ | ౧౨॥ఆనందమయోభ్యాసాత్॥ | వృత్తికారార్థము—<br>ఆనందశబ్దము పరమాత్మపరముగాఁ దైత్తిరీయమునఁ బలుమారు ప్రయోగింపఁబడియుండుటవలన "అన్యోంతర ఆత్మానందమయః" అనుచో నానందమయశబ్దవాచ్యుఁడు పరమాత్మయే.<br>శంకరార్థము.<br>తైత్తిరీయమున బ్రహ్మపదమునకు మరల మరలఁ బ్రయోగముండుటవలన నానందమయ వాక్యమున నున్న "బ్రహ్మపు | ఆనంద ప్రచురుండై।<br>యానందప్రదుఁడు నాగ ఖ్యాతింగల యా।<br>యానందవాక్యబోధితుఁ। (చేన్॥<br>డానందమయుండు పరుఁడె యభ్యాసము<br>౧౨. ౧౩, ౧౪ సూ॥<br>తుచ్ఛాన్నమయ ప్రభృతి ప।<br>రిచ్ఛిన్నము గాక వర తురీయాత్మకమై।<br>సచ్ఛబ్ద ద్యోతితమౌ।<br>పుచ్ఛ బ్రహ్మమ్మఖండ పూర్ణంబరయన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందములు. |
|---|---|---|---|
| | | చ్ఛం ప్రతిష్ఠా" యనుచో బ్రహ్మశబ్ద వాచ్యము స్వప్రధానమేకాని యది యానందమయున కవయవము కాదు. | |
| | ౧౩॥ వికారశబ్దాన్నేతి చేన్నప్రాచుర్యాత్ | వృ॥ వికారార్థము నిచ్చు మయట్ప్రత్యయ ప్రయోగ ముండుటవలన నానందమయుఁడు పరమాత్మ కాఁడంటివేని నది సరికాదు; మయట్ప్రత్యయమిచట బాహుళ్యార్థ బోధకము.<br><br>శం॥ శ్రుతియం దవయవార్థము నిచ్చు పుచ్ఛశబ్దప్రయోగ ముండుటవలన బ్రహ్మము స్వప్రధానము కాదంటివేని నది సరికాదు; పుచ్ఛశబ్దమిచటఁ బుచ్ఛసదృశమ | |

| | | |
|---|---|---|
| | గు నాధారపరముగాఁ దరుచుఁ బ్రయోగింపఁబడియున్నది. | |
| ౧౪॥ తద్ధేతువ్యపదేశాచ్చ॥ | వృ॥ బ్రహ్మమానందప్రదమని "ఏషహ్యేవానందయాతి" యను శ్రుతి తెలుపుచుండుటవలనను మయట్ప్రత్యయము ప్రాచుర్యపరమే॥ | |
| | శం॥ బ్రహ్మపుచ్ఛమ్మనువాక్యమందుఁ బ్రతిపాదింపఁబడిన బ్రహ్మము సమస్త వికారజాతమునకు హేతువుగా "ఇదగ్ంసర్వమసృజత" యను శ్రుతి తెలుపుచుండుటవలనను బ్రహ్మము స్వప్రధానమే. | |
| ౧౫॥ మాంత్రవర్ణికమేవచగీయతే॥ | వృ॥ "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యనుమంత్రాక్షరములచేఁ బ్రతిపాదింపఁబడిన వస్తువే "అన్యోంతర ఆత్మానందమయః" అను బ్రాహ్మణమందును గానము చేయఁబడియున్నది. ఈ హేతువువ | మంత్ర బ్రాహ్మణములు సమ। తంత్రము, లితరుండు సృష్ట్యాదత్తుఁడు, మంత్రితుఁడున్, దతాఽపిల। (భిన్నా తంత్రగము జడము, శ్రుతియనెఁ దద్యోగంబున్॥<br>౧౫, ౧౬, ౧౭, ౧౮, ౧౯ సూ॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | లనఁగూడ నానందమయుఁడు పరమాత్మయే.<br><br>శం॥ "బ్రహ్మవిదాప్నోతి పరం" అను మంత్రాక్షరములయందుఁ బ్రతిపాదింపఁబడిన వస్తువే "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" యను బ్రాహ్మణమందును గానము చేయఁబడి యున్నది. ఇందువలనఁ గూడ బ్రహ్మము స్వప్రధానమే. | |
| | ౧౬॥ నేతరోऽనుపపత్తేః | వ్యా॥ జగత్స్రష్టృత్వాదికము జీవునకు పపన్నము కాకపోవుటవలన బ్రహ్మేతరుఁడగు జీవుఁ డానందమయ శబ్దవాచ్యుఁడు కాఁడు. | |

శం॥ జగత్స్రష్టృత్వాది ధర్మములు బ్రహ్మేతరుఁడగు నానందమయున కనఁగా జీవున కుపచరించకపోవుటవలన వాఁడీప్రకరణ ప్రతిపాద్యుఁడు కాఁడు.

**౧౭॥ భేదవ్యపదేశాచ్చ**

వృ॥ జీవుఁ డానందమయుని కంటె భిన్నుఁడుగాఁ జెప్పఁబడి యుండుటవలనను, ఆనందమయుఁడు జీవుఁడు కాఁడు.

శం॥ ఆనందమయుఁడు పరమాత్మకంటె భిన్నుఁడుగాఁ జెప్పఁబడి యుండుటవలనను వాఁడు పరమాత్మ కాఁడు.

**౧౮॥ కామాచ్చ నానుమానాపేక్షా॥**

వృ॥ జగత్కారణముగా నిందు వివక్షింపఁబడిన యానందమయ పదార్థము సంకల్పించినట్లు "సోకామయతే"త్యాది వాక్యమునఁ జెప్పఁబడుటవలన నాకారణము ప్రధానము కాదు.

శం॥ భృగువల్లియం దానంద శబ్దమా

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | త్రప్రయోగ ముండుటవలనను, ఆనందమ యుఁడు బ్రహ్మమని యూహింపనవకాశ ము లేదు. | |
| | ౧౯॥ అస్మిన్నస్యచ త ద్యోగం శాస్తి॥ | వృ॥ ఈ యానందమయ ప్రకరణమం దానందమయ విషయకజ్ఞానముగల జీవున కానందమయునితో సంయోగమును శా స్త్రము విధించుచున్నది.<br>శం॥ పుచ్ఛబ్రహ్మమం దానందమయు నికిc దాదాత్మ్యమును శాస్త్రము విధింపు చున్నది. | |
| ౭॥ అంతరధి॥ | ౨౦॥ అంత స్తద్ధర్మోప దేశాత్॥ | అక్ష్యాదిత్యమధ్యవర్తికిc బరమేశ్వరధ ర్మములున్నట్లు చెప్పఁబడుటవలన వాఁడు పరమేశ్వరుఁడే. | నేత్రాదిత్యాంతరుఁడై। సూత్రాత్మగుణప్రయుక్తి శోభిలు నా చి। న్మాత్రుని హిరణ్యశ్మశ్రు సు। |

| | | | |
|---|---|---|---|
| | ౨౧॥ భేదవ్యపదేశాచ్చాన్యః॥ | అంతర్యామి బ్రాహ్మణమున భేదముగాఁ జెప్పఁబడియుండుటవలనను, సూర్యమండలాభిమాన దేవతకంటె హిరణ్మయ పురుషుఁడన్యుఁడు. | గాత్రి నుదితు సూర్యభిన్నుఁ గను మీశుని ౨౦, ౨౧ సూ॥ ( గాన్॥ |
| ౮॥ ఆకాశాధి॥ | ౨౨॥ ఆకాశ స్తల్లింగాత్॥ | "అస్య లోకస్య కా గతిరిత్యాకాశ ఇతి" యనుచో సర్వ భూతోత్పత్తిలయాది బ్రహ్మలక్షణము లాకాశమునకుఁ జెప్పఁబడుటవలన నాకాశశబ్దవాచ్యమించటఁ బరబ్రహ్మమే కాని భూతాకాశము కాదు. | లోకోత్పత్తి వినాశము। లేకతమునఁ గలుగుచున్న వేపెనుభూతం। బేకాశ్రయమన్నిటికా। యాకాశపద ప్రతీతుఁ డాత్మయె చూడన్॥ |
| ౯॥ ప్రాణాధి॥ | ౨౩॥ అతఏవ ప్రాణః॥ | పూర్వసూత్రోదాహృత బ్రహ్మలింగములే "కతమా సా దేవతేతి- ప్రాణ ఇతి" యనుచోఁ బ్రాణమునకుఁగూడఁ జెప్పఁబడుటవలనఁ బ్రాణశబ్దవాచ్యము బ్రహ్మమే కాని ప్రాణవాయువు కాదు. | ఎందుండి యుద్గమించును। నెందున భూతంబు లుపరమించును దేనిన్। జెందును జీవుఁడు సుప్తిన్। బొందిన,నలప్రాణశబ్దబోధ్యము పరుఁడే॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| ౧౦॥ జ్యోతిరధి॥ | ౨౪॥ జ్యోతి శ్చరణాభిధానాత్॥ | "త్రిపాదస్యామృతందివి" యను వాక్యమున బ్రహ్మమునకుఁ బాదత్రయాభిధానముండుటవలనను, ఆబ్రహ్మమునకే "పరోదివోజ్యోతిర్దీప్యతే" యను ప్రకృత వాక్యమున ద్యులోక సంబంధరూపమగు ప్రత్యభిజ్ఞానముండుటవలనను, జ్యోతిశ్శబ్ద వాచ్యము బ్రహ్మముగాని ప్రాకృతజ్యోతిస్సుకాదు- | పాదత్రితయము దివిగాఁ। బాదంబేకంబు భూతభాతికతతిగా। నేదీప్తికొదవు నదియె యీ। నూదితమిచ్చో ద్యుశబ్దయోగము వలనన్। |
| | ౨౫॥ ఛందోభిధానాన్నేతిచేన్న, తథా చేతోర్పణనిగదాత్తథాహిదర్శనమ్॥ | శ్రుతి గాయత్రీచ్ఛందస్సును జెప్పుటవలనఁ బ్రకరణ ప్రతిపాద్యము బ్రహ్మము కాదంటివేని నది సరికాదు. ఏలననఁగా, గాయత్ర్యాఖ్య ఛందోద్వారమున గాయత్ర్యవచ్ఛిన్న బ్రహ్మోపాసనము చెప్పఁబ | చేతోర్పణనిగదంబున। భూతాదిక పాదమాత్రబోధోపగతిన్। శ్రుత్యుపదేశభేద। ఖ్యాతివిరోధంబు లేమి నది బ్రహ్మంబే॥ ౨౫, ౨౬, ౨౭ సూ॥ |

డినది; ఉపాధిద్వారముగా నేకదా శ్రు
త్యంతరమందును బ్రహ్మోపాసనము తెలి
యవచ్చుచున్నది.

అర్థాంతరము:—గాయత్రివలెనె బ్ర
హ్మమునకుఁ జతుష్పదగుణసామ్య ముండు
టవలన, నేగాయత్రీ శబ్దమూలముగ బ్ర
హ్మమునందుఁ జిత్తసమర్పణము బోధిం
పఁబడెనో యాగాయత్రీ శబ్దముచేఁ బూ
ర్వవాక్యమున బ్రహ్మమే నిర్దేశింపఁబడి
యుండుటచేఁ బ్రకరణ ప్రతిపాద్యము
గాయత్రీచ్ఛందస్సు కాదు. ఇటులనేకదా
ఛందోభిధాయకములగు శబ్దములు సం
ఖ్యాసామ్యమునుబట్టి శ్రుత్యంతరమున న
న్యార్థము నిచ్చుచున్నటుల దృశ్యము లగు
చున్నవి.

౨౬॥ భూతాదిపాదవ్య — భూతాదులు గాయత్రికంశమను నిర్దే

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ప దేశోపపత్తేశ్చై వమ్॥ | శము సందర్శించుటవలనఁ గూడఁ బై ప్రకారము గాయత్రీశబ్దము బ్రహ్మబోధకమే. | |
| | ౨౭॥ ఉపదేశభేదాన్నే తిచే న్నోభయస్మి న్నప్యవిరోధాత్॥ | "దివి, దివః" అను సప్తమీ పంచమీ విభక్త్యంత శబ్దోపదేశ భేదమువలన గాయత్రీవాక్యమందు నిర్దేశింపఁబడిన వస్తువు జ్యోతిర్వాక్యమందాకాంక్షింపఁ బడలే దంటివేని నది సరికాదు. ఏలననఁగా నీ యుభయోపదేశములయందును విరోధము లేదు. | |
| ౧౧॥ఇంద్రప్రాణా ధి॥ | ౨౮॥ ప్రాణస్తథానుగ మాత్॥ | "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా" యనుచోఁ బ్రాణశబ్దము బ్రహ్మపరముగా వాక్యస | ఏనియుపాసనము సురా। పాన స్తేయాద్యఘములఁ బాపు న్వధి నా॥ |

| | | |
|---|---|---|
| | మన్వయ ముండుటవలన నది ప్రాణవాయుపరము కాదు. | ప్రాణుఁడై ప్రజ్ఞాత్మయు।<br>నానందంబజరమమృతమాయువుఁదలపన్॥ |
| ౨౯॥ నవక్తు రాత్మోపదేశాదితిచే దధ్యాత్మ సంబంధ భూమాహ్యస్మిన్॥ | ఉపదేశకుఁడగు నింద్రుని స్వస్వరూపధ్యానము బోధింపఁబడుటవలనఁ బ్రాణశబ్దమిచట బ్రహ్మవాచకము కాదంటివేని సరికాదు; వీలనఁగా నీప్రకరణమందుఁ బ్రత్యగాత్మ ధర్మకథన బాహుళ్యము కలదు గావునఁ బ్రాణపదమింద్రదేవతాపరము కాదు. | ఆధ్యాత్మిక సంబంధము।<br>హృద్యంబై బహుళమగుట నింద్రాత్మ<br>బోధ్యంబుగాదు, మఱియున్। (యిటన్।<br>సాధ్యము స్వాత్మోపదిష్టి శాస్త్రజ్ఞులకున్॥<br>౨౯॥ ౩౦ సూ॥ |
| ౩౦॥ శాస్త్ర దృష్ట్యా తూపదేశో వామదేవవత్॥ | శాస్త్రమందుఁ జెప్పఁబడిన రీతిని స్వాత్మయే పరమాత్మయని యింద్రుఁడు తెలిసినవాఁడగుటచే వామదేవుని యుపదేశమువలెనే యింద్రునిచే "మామేవ విజానీహి" యని చేయఁబడిన స్వాత్మోపదేశమును, ఉపపత్తి కలదగుచున్నది. | |
| ౩౧॥ జీవముఖ్యప్రాణ | జీవముఖ్యప్రాణములకే యుపపన్న | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | లింగాన్నేతిచేన్నో పాసా త్రైవిధ్యా దాశ్రితత్వా దిహ తద్యోగాత్॥ | ములగు ధర్మములు శ్రుతియందుఁ జెప్పఁబడుటవలనఁ బ్రాణపదవాచ్యము బ్రహ్మము కాదంటివేని నది సరికాదు. ఏలననఁగా, (౧) పూర్వ పక్షివాదము నిజమైనచో నొక్క-టే ప్రకరణమునఁ ద్రివిధోపాసనములు బోధించినట్లగును; (౨) ప్రాణశబ్దము బ్రహ్మపరముగా శ్రుత్యంతరమునఁ గూడఁ బరిగ్రహింపఁబడి యున్నది; (౩) ఈప్రకరణమందు శ్రుత్యంతరమందు వలెనె ప్రాణమునకు బ్రహ్మలింగములు చెప్పఁబడియున్నవి. కావునఁ బ్రాణపదవాచ్యము జీవముఖ్య ప్రాణములలో నెద్దియుఁగాదు.<br><br>ఓం తత్సత్. | జీవుఁడు ముఖ్యప్రాణముఁ । గా వల దలప్రాణశబ్దగదితు లు;పాసా । త్రైవిధ్యముచే, వేఱొక । తావున నిటులుయుంట; నిటను దద్యోగము (చేస॥ |

# బ్రహ్మసూత్రార్థ సంగ్రహము.

## ప్రథమాధ్యాయము. ద్వితీయపాదము.

కం॥ సర్వనిగమప్రసిద్ధుని। సర్వాత్మను హృద్గుహాధిశాయిని నేత్రిం।
తర్వర్తి నంతరాత్మను। పర్వేద్యు నదృశ్యుఁ గొల్తు వైశ్వానరునిన్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| ౧॥ సర్వత్ర ప్రసిద్ధ్యధి॥ | ౧॥ సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్॥ | సమస్తవేదాంతములయందును బ్రహ్మమే జగత్కారణమని ప్రసిద్ధముగా నుపదేశింపఁబడి యుండుటవలన "తజ్జలానితి శాంతఉపాసీత" త్యాది వాక్యమున మనోమయత్వాది ధర్మములచే నుపాస్యుఁడుగా వర్ణింపఁబడినవాఁడు పరమాత్మయే కాని శారీరుఁడు కాఁడు. | "సర్వంఖల్విదమ"ను శ్రుతి। సర్వేశ్వర పరమ, కాక శారీరునకున్। నిర్వాహమగునె తజ్జల। తోర్వీజ్యాయస్త్వ ముఖ గుణోన్నతిఁదలఁ (పన్॥ ౧, ౨, ౩ సూ॥ |
| | ౨॥ వివక్షితగుణోపప | శ్రుత్యుక్తములగు సత్యసంకల్పత్వాది | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | త్తేశ్చ॥ | గుణములు బ్రహ్మమున కుపపన్నములగు చుండుటవలన నిచట బ్రహ్మమే యుపాస్యము. | |
| | ౩॥ అనుపపత్తేస్తు నశారీరః॥ | వివక్షిత గుణములు జీవున కుపపన్నములు కాకుండుటవలన నిశ్చయముగా వాఁడుపాస్యుఁడు కాఁడు. | |
| | ౪॥ కర్మకర్తృవ్యపదేశాచ్చ॥ | మనోమయత్వాది గుణకుని ప్రాప్యముగాను శారీరుని ప్రాప్తనుగాను శ్రుతి తెలుపుచుండుటవలనను శారీరుఁ డుపాస్యుఁడు కాఁడు. | శారీరుఁ డుపాస్యుఁడు కాఁ।<br>డారూఢిగఁ గర్మకర్తృతాఖ్యానముచే।<br>నారయ శబ్దవిశేషను।<br>నీరీతినె స్మృతియుఁగూడనిరవొందుటచేన్॥<br>౪, ౫, ౬ సూ॥ |
| | ౫॥ శబ్దవిశేషాత్॥ | "అయమంతరాత్మన్ పురుషో హిరణ్మయః" అనుచో సప్తమ్యంత ప్రథమాం | |

| | | |
|---|---|---|
| | తపదభేద ముండుటవలన నుపాస్యుఁడగు మనోమయత్వాది గుణకుఁ డుపాసకుఁడగు శారీరునికంటె నన్యుఁడు. | |
| ౬॥ స్మృతేశ్చ॥ | "ఈశ్వరస్సర్వభూతానా" మిత్యాది స్మృతివాక్యమువలనఁ గూడ జీవేశ్వరులు భిన్నులు. | |
| ౭॥ అర్భకౌక స్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న, నిచాయ్యత్వా దేవం వ్యోమవచ్చ॥ | "ఏషమఆత్మాన్తర్హృదయే***అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా" అనుచో నుపాస్యున కల్పస్థానాశ్రయత్వా ణీయస్త్వములు చెప్పఁబడుటవలన వాఁడీశ్వరుఁడు కాఁడంటివేని నది సరికాదు. ఏలననఁగా సర్వగతమగు నాకాశమునకువలెనె యుపాధినిబట్టి పరిచ్ఛిన్నాయతనత్వాణీయస్త్వములు సిద్ధించునని యోచింపఁదగియున్నది. | అల్పౌకోణీయస్త్వ సు।<br>కల్పన సర్వగతమైన ఖమ్మునకువలెన్।<br>బొల్పుగ (1) నిచాయ్య మాత్మకుఁ।<br>గీల్పడదనుభవము నిహతకల్మిషుఁ డగుటన్॥<br>౭, ౮ సూ॥ |

(1) యోజనీయము.

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ౮॥ సంభోగప్రాప్తి రితిచేన్న వైశేష్యాత్॥ | సర్వప్రాణిహృదయసంబంధముచే నీశ్వరునకు సుఖదుఃఖాద్యనుభవము ప్రసక్తించునంటివేని నట్లు కాదు. ఏలననఁగా నపహతపాప్మత్వాది జీవవిరుద్ధధర్మవిశేషమీశ్వరునకుఁ గలదు. | |
| ౨॥ అత్త్రధి॥ | ౯॥ అత్తా చరాచర గ్రహణాత్॥ | కఠవల్లియం దుపదేశింపఁబడిన "ఓదనోపసేచన" వ్యాపారకర్త, స్థావరజంగమాత్మక ప్రపంచభక్షకుఁ డనఁబడుటవలన వాఁడు పరమేశ్వరుఁడే కాని జీవుఁడు కాఁడు. | ఓదనము చరాచర చయ। మోదన సంస్కార వస్తు వాగి మృత్యువు నాదటఁ గొను భూతంబున। (గా కాదరువాత్మయె ప్రకరణసార్థక్యముచేన్। ౯, ౧౦ సూ॥ |
| | ౧౦॥ ప్రకరణాచ్చ॥ | ఇది బ్రహ్మవిషయక ప్రకరణముగుటవలనఁ గూడ నిచట భక్షకుఁడుఁగాఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే॥ | |

| | | | |
|---|---|---|---|
| ౩॥ గుహాధి॥ | ౧౧॥ గుహాం ప్రవిష్టా వాత్మానౌహి తద్దర్శనాత్॥ | కఠవల్లియందు హృదయగుహాప్రవిష్టులుగాఁ జెప్పఁబడినవారు జీవాత్మ పరమాత్మలుగాని బుద్ధిజీవులుకారు. ఏలననఁగా వారిరువురకే గుహాప్రవేశము శ్రుతులయందు బోధింపఁబడియున్నది. | హృదయగుహాంతస్థానము।<br>సదనముగాఁ గల్గి కర్మజనితఫలములన్।<br>మెదవెడి వస్తుద్వంద్వము।<br>గద జీవేశ్వరులు గంతృగంతవ్యతలన్॥<br>౧౧, ౧౨ సూ॥ |
| | ౧౨॥ విశేషణాచ్చ॥ | శ్రుతియందలి గంతృగంతవ్యాది లింగములచేఁగూడ జీవాత్మ పరమాత్మలే ప్రకరణప్రతిపాద్యులు. | |
| ౪॥ అంతరాధి॥ | ౧౩॥ అంతరఉపపత్తేః॥ | “యఏషోఽక్షిణి పురుషోదృశ్యతే” అను చో నక్ష్యంతరపురుషుఁడు పరమాత్మయే, ఏలననఁగా శ్రుత్యుక్తధర్మములతోనికేయుపపన్నము లగుచున్నవిగాని ప్రతిబింబ, విజ్ఞానాత్మ, దేవతాత్మల కుపపన్నము లగుటలేదు. | అక్షిప్రదృశ్యపురుషం।<br>డక్షరుఁ డమృతుండు నభయుఁ డాత్మయు<br>సాక్షాత్ప్రతిబింబాది వి। (గానన్।<br>లక్షణుఁడై వెలయునతఁడులలిబ్రహ్మంబే॥ |
| | ౧౪॥ స్థానాది వ్యపదే | పరమేశ్వరునకు నివాసనామరూపము | స్థానోన్నామ సురూపో। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | శాచ్చ॥ | లు శ్రుత్యంతరమునఁగూడ నుపదేశింపఁబడియుండుటచే నిచట నక్ష్యంతరుఁడు పరమాత్మయే. | గ్గానాన్యశ్రుతులునుంటఁ దత్సుఖయుక్తా। ఖ్యాన శ్రుతివిద్గత్యభి। ధానమ్ముల నక్షిగతుఁడు తద్బ్రహ్మంబే॥ ౧౪, ౧౫, ౧౬ సూ॥ |
| | ౧౫॥ సుఖ విశిష్టాభిధానాదేవచ॥ | "ప్రాణోబ్రహ్మ- కం బ్రహ్మ" యని యక్ష్యంతరపురుషునకు సుఖప్రయుక్తత్వము చెప్పఁబడుటవలనఁగూడ నతఁడు పరమేశ్వరుఁడే. | |
| | ౧౬॥ శ్రుతోపనిషత్క గత్యభిధానాచ్చ॥ | వేదాంతరహస్యవేత్త కేయుత్తమగతి కలుగునో యదియె గతి యీయక్ష్యంతర పురుషవిదునకును గలుగునని తెలుపఁబడుటచే నక్ష్యంతర పురుషుఁడు పరమేశ్వరుఁడే. | |

| | | | |
|---|---|---|---|
| | ౧౭॥ అనవస్థితే రసం భవాచ్చ నేతరః॥ | ప్రతిబింబాత్మకు నేత్రమున నియతస్థితి లేకుండుటవలనను శ్రుత్యుక్త ధర్మములు వానికిఁగాని విజ్ఞానాత్మ దేవాత్మలకుఁగాని లేకుండుటవలనను, అక్ష్యంతర పురుషుఁడీయాత్మలలో నెవ్వఁడును గాఁడు. | ప్రతిబింబ జీవసూర్యులు। ప్రతిపాదితులిచటఁగారు పలుకేఁపన్। బ్రతిబింబునకనవస్థితి। నితరుల్ శ్రుత్యుక్తధర్మహీనులు గానన్॥ |
| ౫॥ అంతర్యామ్యధి॥ | ౧౮॥ అంతర్యామ్యధి దైవాదిషు తద్ధర్మ వ్యపదేశాత్॥ | అధిదైవాధిలోకాదులయం దంతర్యామిగానున్నవానికి బ్రహ్మధర్మములు చెప్పఁబడుటచే వాఁడు పరమేశ్వరుఁడే; అంతియెకాని దేవతాత్మయొండె సిద్ధయోగియొండె కాఁడు. | సాంతములగు భూతాదుల। నంతరుఁడై వానికి న్నియామకుఁడౌ ధీ। మంతుఁడు శ్రీమంతుఁడు స। (సువ్వే॥ ర్వాంతర్యామ్యమృతుఁడు పరమాత్మయ అధిదైవాధ్యాత్మాదుల। నధిగతుఁడైయున్నపురుషుఁడస్పృతాత్మత్వ ప్రథితుండీదృశపరమా। త్మధర్మములావవవు దేవతాయోగులకున్॥ ౧౮ సూ॥ |
| | ౧౯॥ నచస్మార్తమతద్ధర్మాభిలాపాత్॥ | సాంఖ్యస్మృతి ప్రతిపాద్యమైన ప్రధానమంతర్యామి కాఁజాలదు. ఏలననఁగాఁ | స్మార్తంబంతర్యామిగ। వర్తిలదు విరుద్ధ ధర్మవర్ణన ముంటన్। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | | ప్రధానమునకు సంభవింపని చేతనధర్మములు దానికిఁ జెప్పఁబడియున్నవి. | గిర్త్రించిరి జీవేతరు। స్మర్తృవ్యనిగాను గాణ్వమాధ్యందినులున్॥ ౧౯, ౨౦ సూ॥ |
| | ౨౦॥ శారీరశ్చోభయేపిహి భేదేనైన మధీయతే॥ | జీవుఁడును, అంతర్యామికాఁడు. ఏలననఁగాఁ గాణ్వమాధ్యందినులీజీవుని నంతర్యామికంటె భిన్నునిగాఁ బఠింపుచున్నారు. | |
| ౬॥ అదృశ్యత్వాదిగుణకాధి॥ | ౨౧॥ అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః॥ | "యత్తదద్రేశ్య"మిత్యాది వాక్యమున నదృశ్యత్వాది గుణములతో వర్ణింపఁబడిన భూతయోని పరమాత్మయే; ఏలననఁగా సర్వజ్ఞత్వాది ధర్మములాభూతయోనికిఁ జెప్పఁబడి యున్నవి. | అక్షరపదవాచ్యంబై। చక్షురగోచరమునైయు సర్వజ్ఞతతో। లక్షితహాస్మార్తాదివి। లక్షణమగు భూతయోనిలలి బ్రహ్మఁజే॥ |
| | ౨౨॥ విశేషణభేదవ్యపదేశాభ్యాంచనేతరౌ॥ | "అప్రాణోహ్యమనాశ్శుభ్రః" ఇత్యాదిశారీరభిన్నవిశేషణ కథనమువలనను, "అ | పురుషాన్యవిశేషములఁ। బరాక్షరవిభిన్నుఁడనెడు వ్యపదేశమునన్। |

| | | | |
|---|---|---|---|
| | | క్షరాత్పరతః పరః" అని ప్రధానభిన్నత్వ కథనమువలనను శారీరప్రధానములు భూతయోని శబ్దవాచ్యములు కావు. | వరరూపోపన్యాసము। బరగుటఁ దద్భూతయోని పరమాత్ముండే॥ ౨౨, ౨౩ సూ॥ |
| | ౨౩॥ రూపోపన్యాసాచ్చ॥ | భూతయోనికి సర్వ భూతాంతరాత్మకమగు రూపము కలదని శ్రుతిచెప్పుటవలనఁ గూడ భూతయోని పరమేశ్వరుఁడే॥ | |
| ౭॥ వైశ్వానరాధి॥ | ౨౪॥ వైశ్వానర స్సాధారణశబ్దవిశేషాత్॥ | వైశ్వానర శబ్దము జాఠర భూతాగ్ని దేవతలకు సాధారణమై యున్నను, ఆత్మశబ్దము శారీర పరమేశ్వరులకు సాధారణమై యున్నను, జాఠర, భూతాగ్ని, దేవతా, శారీరుల కసాధారణములగు ద్యుమూర్ధత్వాది లింగములు ప్రకరణ ప్రతిపాద్యుఁడగు వైశ్వానరునకుఁ జెప్పఁబడుటవలన నతఁడు పరమేశ్వరుఁడే. | విశ్వాత్ముండై యపరిమి। తైశ్వర్యోపేతుఁడగుచు నాత్మఖ్యాతిన్। వైశ్వానరుఁడనఁబడు వాఁ। డీశ్వరుఁడేకాక యన్యమెట్లగుఁ దలపన్॥ సాధారణశబ్ద విశే। షాధికతన్; స్మర్యమాణమనుమానంబై। బోధించుటఁ ద్రైలోక్యో। పాధికు; (1) వైశ్వానరుండు పరమేశ్వరుఁడే॥ ౨౪, ౨౫ సూ॥ |
| | ౨౫॥ స్మర్యమాణమను | విష్ణుపురాణమందు స్మరింపఁబడిన రూ | |

(1) పూర్వక్రియతో నన్వయము.

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | మానలస్యాదితి॥ | పము శ్రుత్యుక్తమగు పరమేశ్వరరూపమునకు జ్ఞాపకమగుచున్నది; కావున వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడే॥ | |
| | ౨౬॥ శబ్దాదిభ్యోఽంతః ప్రతిష్ఠానాన్నేతిచేన్న, తథా దృష్ట్యుపదేశాదసంభవాత్పురుషమపి చైనమధీయతే॥ | అర్థాంతరమునిచ్చు నగ్ని వైశ్వానరశబ్దప్రయోగములవలనను, శ్రుతియందుఁ ద్రేతాగ్నికల్పనయుండుటవలనను, వైశ్వానరునకు శరీరాంతరవస్థానము చెప్పఁబడుటవలనను, అతఁడు పరమేశ్వరుఁడు కాఁడు; ఇట్లంటివేని యుక్తముకాదు; ఏలననఁగా జాఠరుఁడగు వైశ్వానరునియందుఁ బరమేశ్వరదృష్టి యుపదేశింపఁ బడుటవలనను, కేవల జాఠరాగ్నికి ద్యుమూర్ధత్వాది ధర్మములు సంభవింపకపోవుటవలనను, వై | జాఠరదృష్ట్యుపదిష్టత! జాఠరమాత్రునకు (1) మూర్త్యసంభవమ జాఠరుఁడు పురుషుఁడనియొక। (గుటన్। పాఠంబుండుట నతండు పరమేశ్వరుఁడే॥ ౨౬, ౨౭ సూ॥ |

(1) ద్యుమూర్ధాత్మక శరీరము.

| | | |
|---|---|---|
| | శ్వానరుఁడు జాఠరాగ్నిమాత్రుఁడు కాఁడు; ఈవైశ్వానరునకుఁ బురుషవిధత్వ మనఁగాఁ బురుషతుల్యత్వము వాజసనేయులు పఠింపుచున్నారు. | |
| ౨౭॥ అతఏవ న దేవతా భూతంచ॥ | ద్యుమూర్ధత్వాదికము లేకపోవుటచే నగ్న్యభిమాని దేవతయొండె భూతాగ్నియొండె వైశ్వానరశబ్దవాచ్యుఁడు కాఁడు. | |
| ౨౮॥ సాక్షాదప్యవిరోధం జైమినిః॥ | ప్రతీకోపాధుల సంబంధము లేకయే పరమేశ్వరోపాసనము ప్రత్యక్షముగా బోధింపఁబడినదని చెప్పినను బాధకము లేదని జైమిన్యాచార్యుని మతము. | సాక్షాత్పరమేశ్వరుఁడే। యీతఁడవిషయుఁడని పలెఁ నిట జైమినిః ప్రత్యక్షంబగుఁ బాదేశా। ధ్యక్షత నని యాశ్మరథ్యుఁ డభిలాపించెన్॥ ౨౮, ౨౯ సూ॥ |
| ౨౯॥ అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః॥ | వైశ్వానరోపాసకుల కీశ్వరుఁడు ప్రాదేశమాత్రపరిమితితోఁ బ్రత్యక్షమగుటవలన శ్రుతివిరోధము లేదని యాశ్మరథ్యుని మతము. | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౩౦॥ అనుస్మృతే ర్బాదరిః॥ | మనోనుగుణముగా వైశ్వానరుని ధ్యానించుటవలన శ్రుతివిరోధము లేదని బాదరి ముని మతము. | స్మృత్యనుసారధ్యానము। ప్రత్యేతవ్యంబటంచు బాదరిమునియున్। నిత్యము సంపదూపము। స్తుత్యంబని నిర్వచించె సుధి జైమినియున్॥ ౩౦, ౩౧ సూ॥ |
| | ౩౧॥ సంపత్తేరితి జైమినిస్తథాహిదర్శయతి॥ | మూర్ధాది చుబుకపర్యంత ప్రదేశములో విరాట్స్వరూపమునంతయు సంపాదించుటవలనఁ బ్రాదేశమాత్ర శ్రుతివిరోధము లేదని జైమిన్యాచార్యుఁడు తలఁచుచున్నాఁడు. ఇటులనేకదా వాజసనేయి బ్రాహ్మణమును దెలుపుచున్నది. | |
| | ౩౨॥ ఆమనంతి చైనమస్మిన్॥ | ఈపరమేశ్వరుని బ్రాదేశమాత్రస్థునిగ జాబాలురును జెప్పుచున్నారు. | ప్రాదేశమాత్రముననె యు। పాదేయుండభివిమానుఁడవిముక్తమునన్। (1) దాదేశ్యుఁడనుచుఁబలికిరి। వైదుషి జాబాలురిల్లె వైశ్వానరునిన్॥ |

ఓం తత్సత్.

(1) ఉపదేశ్యుఁడు.

## బ్రహ్మసూత్రార్థ సంగ్రహము.

### ప్రథమాధ్యాయము. తృతీయపాదము.

పంచపాది శార్దూలము:—

వ్యోమాద్యాయతనంబు భూమపదవాచ్యుం డక్షరుం డీక్షి క।
ర్మా మోఘవ్యపదేశ్యుఁ డల్పదహరాభ్రభ్రాజితుం డాత్మభా।
సామాహాత్మ్య విభాసితాఖిల జగజ్జాలుం డధీశుండు సు।
త్రామాది త్రిదివేశవేద్యుఁడు సశూద్రజ్ఞేయుఁడున్ శాస్త్ర తే।
జోమాన్యుండు నభఃపదుండు కడుఁ బ్రాజ్ఞుండున్ సదాబ్రోవుతన్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందములు. |
|---|---|---|---|
| ౧॥ ద్యుభ్వాద్యధి॥ | ౧॥ ద్యుభ్వా ద్యాయత నం స్వశబ్దాత్ | యస్మిన్ద్యౌః పృథివీచాంతరిక్ష మో ప్మనుచో దివి భువి లోనగువాని కాధారము బ్రహ్మమే. ఏలననఁగా శ్రుతియం దాత్మశబ్ద ప్రయోగ మున్నది. | * ఆయాత్మపదము ద్యుభ్వా। ద్యాయతనము బ్రహ్మమనుచు వ్యపదేశిం మారెయాన్యంబ తెదుక్తిఁ; ను। (చున్;। పేయంబ; ముక్తులకు;నమృతసేతువుగాన్॥ ౧, ౨, ౩ సూ॥ |
| | ౨॥ ముక్తోపసృప్యవ్యప | ముక్తులకుఁ బ్రాప్యముగాఁ జెప్పఁబ | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | దేశాత్॥ | టుట వలన ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమే. | * ధ్యేయము ముక్తప్రాప్యము।<br>మేయ మసంగంబునై యమృతసేతువుగా।<br>మాయాన్యమగుట ద్యుభ్వా। (లపన్॥ |
| | ౩॥ నానుమానమతచ్ఛబ్దాత్॥ | ప్రధాన బోధక శబ్దాభావమువలన ద్యుభ్వాద్యాయతనము ప్రధానముకాదు. | ద్యాయతనపదార్థము పరమాత్మమె త |
| | ౪॥ ప్రాణభృచ్చ॥ | ఉపాధి పరిచ్ఛిన్నుఁడగు జీవుఁడును ద్యుభ్వాద్యాయతనము కాఁడు. | † భేదవ్యపదేశమునన్।<br>బోధిగ బ్రహ్మప్రకరణమునఁ, గర్మఫలా।<br>స్వాదనమునఁ, జెల్లదు ద్యు। |
| | ౫॥ భేద వ్యపదేశాచ్చ॥ | జీవుఁడు ద్యుభ్వాద్యాయతనముకంటె భేదముగాఁ జెప్పఁబడుటవలన వారనన్యుల నఁగిట్టదు. | భ్వాదుల కాయతనమనుట ప్రాణధరున<br>౪, ౫, ౬, ౭ సూ॥ (కున్॥ |
| | ౬॥ ప్రకరణాత్॥ | ఇది బ్రహ్మవిషయికప్రకరణమగుటవలన జీవుఁడు ద్యుభ్వాద్యాయతనము కాఁడు. | † భేదవ్యపదిష్టత,నుప।<br>పాదిత బ్రహ్మప్రకరణబహుళతఁ, దాట:।<br>స్థ్యాదనములఁ, బ్రాణభృత్తు। |
| | ౭॥ స్థిత్యదనాభ్యాంచ॥ | ఈశ్వరునకుఁ దాటస్థ్యమును జీవున | సాదుగ ద్యుభ్వోతశబ్దసంశ్రితుఁడగునే॥ |

| | | | |
|---|---|---|---|
| | | కుఁగర్మఫలభోక్తృత్వము నుండుటచేఁగూడ జీవుఁడు ద్యుభ్వాద్యాయతనము కాఁడు. | |
| ౨॥ భూమాధి॥ | ౮॥ భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్॥ | "భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః" అనుచో భూమపదవాచ్యుఁడు సుషుప్తునికంటె నెక్కువవాఁడనఁబడుటచే నతఁడు పరమాత్మయే. | సత్యామృతసుఖముఖ్య।<br>శ్రుత్యుక్తగుణోపపత్తి, సుప్తాధ్యుపదే।<br>శాత్యర్థత, * భూమపద।<br>ప్రత్యేతవ్యంబుచూడ బ్రహ్మము సువే॥<br>౮, ౯ సూ॥ |
| | ౯॥ ధర్మోపపత్తేశ్చ॥ | సత్యత్వామృతత్వాది శ్రుత్యుక్త ధర్మముల కుపపత్తి కలుగుటవలన భూమపదార్థము బ్రహ్మమే. | * ఎచ్చటఁ గనవినఁ దెలియన్।<br>నిచ్చలు వేఱొండులేక నిర్విషయంబౌ।<br>యెచ్చట సత్తును సుకమును।<br>నిచ్చలవిడినుండు; భూమ వేద్యము నిదియే। |
| ౩॥ అక్షరాధి॥ | ౧౦॥ అక్షర మంబరాంతధృతేః॥ | "కస్మిన్నుఖల్వాకాశ" ఇత్యాది శ్రుతి యందక్షరశబ్దవాచ్యమున కాకాశాది సమస్త ప్రపంచ ధారణము చెప్పఁబడుటవల | భూతాంతవ్యోమాదుల।<br>నోతప్రోతములుగాఁగ నుగ్గించుట, ఖ।<br>ద్యోతేందుశాసితృత, వి। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | న నది బ్రహ్మమే కాని యోంకార ప్రధాన జీవులలో నెద్దియుఁగాదు. | తేతరభావతను, బ్రహ్మమే యక్షరమౌ॥ ౧౦, ౧౧, ౧౨ సూ॥ |
| | ౧౧॥ సాచ ప్రశాసనాత్॥ | సూర్యచంద్రాదుల నాకాశమందుండునట్లు నియమించిన యక్షరుఁడే యంబరాంతధారకుఁడు కావున నంబరాంతధృతి బ్రహ్మకర్మముగాని ప్రధానకార్యము కాదు. | |
| | ౧౨॥ అన్యభావవ్యావృత్తేశ్చ॥ | బ్రహ్మేతర=( ప్రధానజీవ ) ధర్మములకంటె విలక్షణ ధర్మము లక్షరునకుఁ జెప్పఁబడుటవలన నతఁడు పరమేశ్వరుఁడే. ఒండేని:—జీవునకుఁ బృథక్స్థితి లేదని శ్రుతి చెప్పుచుండుటవలనను, అక్షరశబ్దవాచ్యము బ్రహ్మమే. | |

| | | | |
|---|---|---|---|
| ౪॥ ఈక్షతికర్మాధి॥ | ౧౩॥ ఈక్షతి కర్మవ్యపదేశాత్సః॥ | "పరంపురుష మభిధ్యాయీత" యనుచోఁ బరపురుష శబ్దవాచ్యుఁ డీక్షణ క్రియాకర్మముగాఁ జెప్పఁబడుటవలన నతఁడు పరమేశ్వరుఁడేకాని హిరణ్యగర్భుఁడుఁ గాఁడు. | వరమగు నోంకారముచే। స్మరియింపంబడు పరపురుషప్రఖ్యాతుం। డరయపరాత్పరుఁడగు నా। పరమేశ్వరుఁడే యతండె ప్రజ్ఞేయుండున్॥ |
| ౫॥ దహరాధి॥ | ౧౪॥దహరఉత్తరేభ్యః॥ | "అథ యదిద మస్మిన్బ్రహ్మపురే దహర"మ్మనుచో దహరున కుత్తర వాక్యముల లోఁ జెప్పఁబడిన ధర్మములను బట్టి యతఁడు పరమాత్మయేకాని భూతాకాశ జీవులు కారు. | దహరాంభోజాంతస్థుం। డహరహమున్ జీవగతిని, నఖిల జగద్భృ। న్మహిమను, సర్వాశ్రయతన్,। దహరార్థక ఖప్రసిద్ధి, ద్రష్టవ్యుఁడగున్॥<br>౧౪, ౧౫, ౧౬, ౧౭ సూ॥ |
| | ౧౫॥ గతిశబ్దాభ్యాం తథాహిదృష్టంలింగంచ॥ | దహరము చైతన్యరూపమగు పాపిష్ఠ స్థానమని చెప్పఁబడుటవలనను, శ్రుతియందు "బ్రహ్మలోక" శబ్దప్రయోగ ముండుటవలనను దహరశబ్దవాచ్యుము బ్రహ్మమే. అటులనే శ్రుత్యంతరమునఁ గూడఁ గను | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | హ్మము కాదంటివేని నాదోషపరిహారమి దివరకే చెప్పఁబడినది. | |
| ౭॥ అనుకృత్యధి॥ | ౨౨॥అనుకృతేస్తస్యచ॥ | "నతత్ర సూర్యోభాతి * * * త మేవ భాంతమనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి" యనుచో, 'తత్ర, తం, తస్య,' అనుపదములచే బోధింపఁబడినవాఁడు పరంజ్యోతియెకాని ప్రాకృత తేజస్సుకాదు. ఏలననఁగా వాని ననుసరించి సూర్య చంద్రాదులు ప్రకాశింపుచున్నారు. | ఏ తేజము ననుకృతిఁ బ్ర। ద్యోతన జైవాత్మకోడుపాతభుగ్విద్యు। ద్వ్రాతము భాసిల్లదు నా। జ్యోతిర్మూర్తి పరుఁడె యను శ్రుతులున్ ( స్మృతులున్॥ ౨౨, ౨౩ సూ॥ |
| | ౨౩॥ అపిచ స్మర్యతే॥ | ఇటులనే భగవద్గీతయందు స్మరింపఁబడినది. | |

| | | | |
|---|---|---|---|
| ౮॥ శబ్దాధి॥<br>ఇందే:—<br>దేవతాధి॥ | ౨౪॥ శబ్దాదేవ ప్రమితః॥ | "అంగుష్ఠమాత్రః పురుషః" అనుచో నంగుష్ఠమాత్రపరిమితితో బోధింపఁబడిన వాఁడు, వాక్యశేషమునఁ దెలుపఁబడిన సర్వనియంతృత్వధర్మముచేఁ బరమాత్మయె కాని జీవుఁడు కాఁడు. | అంగుష్ఠప్రమితుండై। యంగముతో సంగమొంద యొగపడు పురుడంగారప్రభగల యా। (షం। మంగళకరమూర్తి పరుఁడె మదిభావింపన్॥<br>౨౪, ౨౫ సూ॥ |
| | ౨౫॥ హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్॥ | వేదాంతశాస్త్రము మనుష్యుని నుద్దేశించి ప్రవర్తించినదగుటవలన వానిహృదయపరిమితిని బట్టి యీశ్వరునకంగుష్ఠమాత్రపరిమితి చెప్పఁబడియె. | |
| ౯॥ తదుపర్యధి॥ | ౨౬॥ తదుపర్యపి బాదరాయణస్సంభవాత్॥ | మనుష్యులకంటెఁ బైనున్న దేవతలకును మోక్షాపేక్ష కలిగియుండుటవలన వారికిని వేదాంతశాస్త్రాధికారము కలదని బాదరాయణముని తలంచుచున్నాఁడు. | బహుదేహస్వీకరణో। న్మహిమముగల భాస్కర వసుమఖవమరుద్వ్య హుతవహులకున్ మోక్షము। (త్సా। విహితంబై యుంట బ్రహ్మవిద్యకుఁ బా (తురీ॥<br>౨౬, ౨౭ సూ॥ |
| | ౨౭॥ విరోధః కర్మణీతి | యజ్ఞాదికర్మములయందు వైరుధ్యము | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్॥ | కలుగునంటివేని నట్లుకాదు; ఏలననఁగా బహుదేహస్వీకరణ సామర్థ్యము దేవతలకుఁ గలదు. అట్లు శ్రుతియుఁ బ్రదర్శింపుచున్నది. | |
| | ౨౮॥ శబ్దఇతిచేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యాం॥ | వేదమందు దేవతాబోధకశబ్దముల క నిత్యత్వదోషము వచ్చునంటివేని నిందాదులా వేదానుగుణముగా సృజింపఁ బడినవారగుటవలన నట్టిదోషము ప్రసక్తింపదు. ఈవిషయమున శ్రుతిస్మృతి ప్రమాణములు కలవు. | వేదంబులు నిత్యంబులు। వేదానుగుణప్రభవులు వృత్రఘ్నాదుల్। సాదృశ్యాకృతినామ వి। భేదవ్యక్తులును గల్పభేదములందున్॥ ౨౮, ౨౯, ౩౦ సూ॥ |
| | ౨౯॥ అతఏవచ నిత్యత్వం॥ | నియతాకృతిగల జగత్తు వేదశబ్ద ప్రభవమగుటవలననే వేదములకు నిత్యత్వము గ్రహింపఁదగినది. | |

| | | |
|---|---|---|
| ౩౦॥ సమాననామరూపత్వా చ్చావృత్తా వప్యవిరోధో దర్శ నాత్స్మృతేశ్చ॥ | మహాప్రళయము వచ్చినను, ఆప్రళయమునకుఁ బూర్వము పదార్థజాలమునకే నామరూపములుండెనో యట్టినామరూపములే నూతనసృష్టియందలి పదార్థములకుఁ గలుగుటవలనను, ఇట్లు శ్రుతి స్మృతులుకూడఁ జెప్పుచుండుటవలనను, వేదమునకు నిత్యత్వవిరోధము లేదు. | |
| ౩౧॥ మధ్వాదిష్వసంభవా దనధికారం జైమినిః॥ | మధువిద్యలోనగు నుపాసనలయందు వస్వాదిదేవతల కుపాసనాయోగ్యత సంభవింపదు గావున, వారికి బ్రహ్మవిద్యాధికారము లేదని జైమినిముని తాత్పర్యము. | మధువిద్యాప్రముఖంబుల। కధికారము లేకయుంట నాదిత్యులకున్। మధుసన్నిభ పరవిద్యా। నధికారులు వారటంచునని జైమినియున్॥ |
| ౩౨॥జ్యోతిషిభావాచ్చ॥ | ప్రాకృతజ్యోతిర్మండలమందు సూర్యచంద్రశుక్రాంగారకాది శబ్దములకుఁ బ్రయోగముండుటవలన జ్యోతిశ్శబ్దవాచ్యులగు దేవతలకు బ్రహ్మవిద్యాధికారము లేదు. | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౩౩॥ భావంతు బాదరాయణోఽస్తిహి॥ | దేవతలకు మధువిద్యాధికారము లేకున్నను బ్రహ్మవిద్యాధికారయోగ్యత కలదు గావున వారికి బ్రహ్మజ్ఞానాధికార సద్భావమును బాదరాయణముని యూహించుచున్నాఁడు. కావునఁ బూర్వపక్షమయుక్తము. | మధువిద్యకుఁ గాకుండిన। నధికారముసంభవించు నాదిత్యులకున్। మధుతుల్యఫలద దహరా। ద్యధిగమమునకంచు బాదరాయణుఁ డనియెన్॥ |
| ౧౦॥ అపశూద్రాధి॥ | ౩౪॥ శుగస్య తదనాదరశ్రవణాత్తదాద్రవణాత్సూచ్యతేహి॥ | ఈజానశ్రుతికి హంస లయ నాదరణద్యోతకములగు వాక్యముల వినుటవలన దుఃఖము కలిగెను. అట్లు కలిగిన వెంటనే యతఁడు గురువును వేగముగాఁ బొందఁగా, గురువతని "శూద్రా" యని సంబోధించె. ఈసంబోధనముచే హంససంభాషణమువలనఁ బూర్వము జానశ్రుతికిఁగలి | శూద్రాయని రైక్వుండనె। శాద్రతజానశ్రుతిని మరాళోక్తికృతో। పద్రవ సూచనకై శుల। శూద్రత్వముచేతఁగాదు శోధింపంగన్॥ |

| | | |
|---|---|---|
| | గిన దుఃఖము సూచింపఁబడెఁగదా. | |
| 3౫॥ క్షత్రియత్వ గతే శ్చోత్తరత్ర చైత్రర థేనలింగాత్॥ | జానశ్రుతి క్షత్రియుఁడను నిశ్చయ ముండుటవలనను, ఉత్తరశ్రుతివాక్యమం దు క్షత్రియుఁడైన చైత్రరథునితో సతఁ డు సంవర్గవిద్యాభ్యాసము చేసినట్లు చె ప్పఁబడుట వలనను, జానశ్రుతి క్షత్రి యుఁడు. | చైత్రరథసహాధ్యయనము! క్షత్రియలింగంబుగాన జానశ్రుతి స। త్క్షత్రియుఁడె బ్రహ్మవిద్యకుఁ। చాతుర్వండచలాది దానాకరతోజ్జ్వలుఁడున్॥ |
| 3౬॥ సంస్కార పరా మర్శా త్తదభావా భిలాపాచ్చ॥ | బ్రహ్మవిద్యోపదేశాంగముగా గురు శిష్యోపనయనాదిసంస్కారములు చె ప్పఁబడుటవలనను శూద్రునకట్టిసంస్కా రయోగ్యత చెప్పఁబడక పోవుట వలనను శూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదు. | విధివిహితకర్మబాహ్యత। (1) విధివచన శ్రవణమనన విధురత జాబా। (2) ల్యధమతను బ్రహ్మవిద్యకు। నధికారము సంభవింపదల శూద్రులకున్॥ |
| 3౭॥ తదభావ నిర్ధార ణేచ ప్రవృత్తేః॥ | జాబాలునికి జాతి శూద్రత్వము లేదని నిశ్చయించినపిమ్మటనే గౌతమఋషి య తని కుపనయనాది సంస్కారములు చేయ | |

(1) బ్రహ్మవాక్యములు=వేదములు.

(2) జాబాలికంటు జాతి సంస్కారా దిహీనత.

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | | యత్నించుట వలన జాతిశూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదు. | |
| | ౩౮॥ శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్స్మృతేశ్చ॥ | వేదశ్రవణాధ్యయనములును, తదర్థావబోధనమును శూద్రులకు నిషేధింపఁబడియుండుటవలనను, అటులనె స్మృతియుండుటవలనను, శూద్రులకు బ్రహ్మవిద్యాధికారము లేదు. | |
| ౧౧॥ కంపనాధి॥ | ౩౯॥ కంపనాత్॥ | ప్రాణుని భయమువలన సమస్తమును జలింపుచున్నట్లు చెప్పఁబడుటవలన నతఁడు పరమాత్మయే. | ఎవ్వని మహాభయమ్మున। నవ్వాయుసఖారుణ-వాసవానిలమృత్యుల్। చివ్వనఁ గంపంబొందుదు। (లపన్॥ రవ్వ్యత్యనిలాశ్రయుఁడు పరాత్మయె త |
| ౧౨॥ జ్యోతిర్దర్శనా | ౪౦॥ జ్యోతిర్దర్శనాత్॥ | శ్రుతియందుఁ "బరంజ్యోతి" యని చె | నిరుపాధిక ప్రియాప్రియ। |

| | | | |
|---|---|---|---|
| | | ప్పఁబడినపదార్థమునకు బ్రహ్మధర్మములు ప్రదర్శింపఁబడుటచే నది భౌతిక తేజోవిశేషము కాదు. | విరహితనిత్యస్వరూపు విజ్ఞేయునిగా।<br>స్మరియింపు మఘవిదూరుని।<br>బరపురుషుని సంప్రసాదుఁ బరమజ్యోతిన్॥ |
| ౧౩॥ అర్థాంతరత్వాదివ్యపదేశాధి | ౪౧॥ ఆకాశోऽర్థాంతరత్వాదివ్యపదేశాత్ | “ఆకాశో హ వై నామ” యను వాక్యమున నాకాశపదవాచ్యము నామరూపాత్మకమైన యాకాశాది ప్రపంచముకంటె భిన్నముగాను, అమృత స్వరూపముగాను జెప్పఁబడుటవలన నది బ్రహ్మమే. | నిర్వాహకుఁడెవ్వండో।<br>సర్వవికృతనామరూపచయ జగమునకున్।<br>బర్వుకొను నెవనియందది।<br>సర్వేశ్వరుఁడమృతుఁడతఁడె సద్వ్యోమం<br>(బున్॥ |
| ౧౪॥ సుషుప్త్యుత్క్రాంత్యధి॥ | ౪౨॥ సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన॥ | “కతమ ఆత్మే” త్యాది ప్రకరణమున విజ్ఞానమయుని కంటె సుషుప్తియందును మరణమందును బరమేశ్వరుఁడు భిన్నుఁడుగా వ్యవహరింపఁబడుటవలన నీప్రకరణము పరమేశ్వరపరము. | నిద్రాప్రాణోత్క్రమణో।<br>పద్రవభేదాపదేశ పత్యాదిపదో।<br>న్ముద్రితుఁడౌ విజ్ఞానము।<br>యద్రష్ట మహాత్ముఁ డజుఁడు హతపాప్మం<br>(డున్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ౪౩॥ పత్యాదిశబ్దేభ్యః॥ | శ్రుతియందు "సర్వస్యాధిపతీ"త్యాది వాక్యమునఁ బత్యాదిశబ్దములుండుటచే నీ ప్రకరణము పరమేశ్వరపరము. | |

ఓం తత్సత్.

# బ్రహ్మసూత్రార్థసంగ్రహము.

## ప్రథమాధ్యాయము. చతుర్థపాదము.

కం॥ ఎంచెద నశబ్దు నజునిన్। బంచజనాధారు సర్వభవకారణు న।
భ్యంచితవేద్యాత్మకునిం బ్ర। పంచాతీతప్రియతముఁ బ్రకృతిన్బరునిన్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౧॥ఆనుమానికాధి॥ | ౧॥ ఆనుమానిక మప్యేకేషామితిచేన్నశరీరరూపకవిన్యస్తగృహీతే ర్దర్శయతిచ॥ | ప్రధానముకూడఁ గాఠకుల శాఖయందు "మహతఃపరమవ్యక్తం" మ్మనుచో నవ్యక్తపదముచేఁ బ్రతిపాదింపఁ బడినదంటివేని నదిసరికాదు. "ఆత్మానం రథినంవిద్ధి శరీరం రథమేవచ" యనుపూర్వవాక్యమున రథరూపముగా వర్ణింపఁబడినశరీరమునే యిచట నవ్యక్తపదము బోధింపుచున్నది; మరియు నటులనె శ్రుతి ప్రదర్శింపుచున్నది. | అవ్యక్తపదము కథమున। నవ్యక్తమ్మనెడి యోజనన్ సూక్ష్మశరీ। రవ్యపదేశకమై యన। భివ్యంజిత నామరూపభేదముఁ దెల్పున్॥<br>౧, ౨ సూ॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ౨॥ సూక్ష్మంతు తదర్హత్వాత్॥ | కారణశరీరమే యవ్యక్తాభిధేయము; ఏలననఁగా దాని కవ్యక్తాభిధానయోగ్యత కలదు. | |
| | ౩॥ తదధీనత్వాదర్థవత్ | ఈశ్వరాధీన మగుటవలన నవ్యక్తము ప్రయోజనకారి యగుచున్నది. | సదధీనంబై సార్థక। మదియగుటన్; ప్రకరణాశ్రయార్థబలము |
| | ౪॥ జ్ఞేయత్వావచనాచ్చ॥ | జ్ఞేయమని చెప్పఁబడకపోవుటవలనను, అవ్యక్తము ప్రధానము కాదు. | సదమలుఁడగు ప్రాజ్ఞుండే। (నన్। విదితుఁడు గానుంట; సాంఖ్య విడనాడఁద (గున్॥ 3, ౫ సూ॥ |
| | ౫॥ వదతీచేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్॥ | "నిచాయ్యతంమృత్యుముఖాత్ప్రముచ్యతే" యనుచో శ్రుతియవ్యక్తమును జ్ఞేయముగాఁ జెప్పుచున్నదంటివేని నది సరికాదు. ప్రకరణ సందర్భమువలన నందు జ్ఞేయుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు ప్రాజ్ఞుఁ డుగదా. | కాదవ్యక్తము కాపిల। వాదాభిహిత ప్రధానపర, మది జ్ఞేయ। త్వోదాహృతిలేమిన్ మహా। దాదికమున్వలెఁ బరార్థ మనుసంధించున్॥ ౪, ౭ సూ॥ |

| | | | |
|---|---|---|---|
| | ౬॥ త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ॥ | మూడువిషయములను గూర్చియె ప్రశ్నములును బ్రత్యుత్తరములును శ్రుతియందుండుటచే శ్రుతిప్రతిపాద్యము ప్రధానముకాదు. | (1) వ్యక్తావ్యక్తజ్ఞ జ్ఞా। నోక్తిని బ్రశ్నోత్తరార్థయోగమ్మున న। వ్యక్తమె జ్ఞేయంబనుటకు। యుక్తి యొకింతయును లేదు యోజింపంగన్॥ |
| | ౭॥ మహద్వచ్చ॥ | "మహాంతంవిభుమాత్మాన" మిత్యాదివాక్యములలో మహచ్ఛబ్దమునకు సాంఖ్యతంత్రప్రసిద్ధార్థమెట్లు గ్రాహ్యము కాదో యటులనె యవ్యక్తమునకును గ్రాహ్యముకాదు. | |
| ౨॥ చమసాధి॥ | ౮॥ చమసవదవిశేషాత్ | "అజామేకాం లోహితశుక్లకృష్ణాం" అను శ్వేతాశ్వతరవాక్యమున నజాశబ్దము యజ్ఞపాత్రసముదాయబోధకమగు చమసశబ్దమువలెనె యనిర్దిష్టమగుటవలన నది ప్రధానపరమేయనఁగిట్టదు. | చమసమువలె నవిశేష। క్రమమొప్ప నజాపదంబు రహి తేజోబ। న్నమయప్రకృతిని, దద్రూ। పములోహితశుక్లకృష్ణపదములు దెల్పున్॥ ౮, ౯ సూ॥ |
| | ౯॥ జ్యోతి రుపక్రమా | తేజోఽబన్నాత్మకమగు ప్రకృతియే | |

(1) ప్రపంచప్రధానపురుష జ్ఞానము.

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | తు తథాహ్యధీయత ఏకే॥ | యజుశ్శబ్దవాచ్యము. అటులనేకదా సామశాఖీయులును గానము చేయుచున్నారు. | |
| | ౧౦॥ కల్పనోపదేశాచ్చ మధ్వాదివ దవిరోధః॥ | అవ్యక్తమును మేకనుగా నుత్ప్రేక్షించి యుపదేశించుటవలన సూర్యుని మధురూపముగాను వాకును గోరూపముగాను పురుషుని నగ్నిరూపముగాను శ్రుతి వర్ణించి యుపదేశించినట్లుగానె విరోధము లేదు. | ఆదిత్యు దేవమధువుగ। నాదహనుఁ బురుషుగ గిరను ధేనువుంగా। నాదేశించినరీతిన్। గాదే యజకును బ్రధానకల్పన యొప్పున్॥ |
| ౩॥ సంఖ్యోపసంగ్రహాధి॥ | ౧౧॥ నసంఖ్యోపసంగ్రహాదపి నానా భావాదతిరేకాచ్చ॥ | పంచవింశతి సంఖ్యాప్రతిపాదనమువలె శ్రుతియందుఁ గన్పట్టినను అయిదయిదులు లేక విడియుండుటవలనను, పంచ | ఐదైదులు సరిలేమియు। మీదన్వస్తుద్వయంబు మిగులుంటను శాస్త్రి। నాదికమే యర్థంబై। |

| | | | |
|---|---|---|---|
| | | పంచ జనాతిరిక్తముగా మరి తెరం హపదార్థములున్నట్టు శ్రుతి తెలుపుచుండుటవలనను సాంఖ్యమతము వైదికముకాదు. | సాదగు నల పంచపంచజనపదమునకున్॥<br>౧౧, ౧౨ సూ॥ |
| | ౧౨॥ ప్రాణాదయోవాక్యశేషాత్॥ | శ్రుత్యుత్తరవాక్యమువలనఁ బ్రాణాదిపంచకము పంచజనశబ్దబోధ్యము. | |
| | ౧౩॥ జ్యోతిషైకేషామసత్యన్నే॥ | కాణ్వశాఖీయుల పాఠమున నన్నములేకున్నను జ్యోతిఃపదార్థముతో పంచసంఖ్యాపూర్తి యగుచున్నది. | మాధ్యందినజనపఠిత।<br>స్వాధ్యాయస్థానుమానసాన్నశ్రుతి దృ।<br>ష్ట్యధ్యగతాన్నపదస్థా ।<br>నాధ్యుషితము జ్యోతియందు రల కాణ్వులిలన్॥ |
| ౪॥ కారణత్వాధి॥ | ౧౪॥ కారణత్వేన చాకాశాదిషు యథా వ్యపదిష్టోక్తేః॥ | ఆకాశాది భూత సృష్టియం దేలక్షణములుగల వస్తువు కారణముగాఁ జెప్పఁబడెనో యావస్తువే ప్రాణాది సృష్టులయందును గారణముగాఁజెప్పఁబడుటవలనశ్రుతి గతిసామాన్యమునకు వైరుధ్యము లేదు. | ఆకాశాదికసృష్టికి ।<br>నేకారణ ముక్తమయ్యె నిట నగ్నిముఖా।<br>నేకాకారక సృష్టుల ।<br>కాకారణముక్తమయ్యె నసదాకృతిగాన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౧౫॥ సమాకర్షాత్॥ | "అసద్వా ఇదమగ్ర ఆసీత్త" నుచో నసచ్ఛబ్దమవ్యాకృత నామరూపాత్మక బ్రహ్మప్రతిపాదకమగుటవలన నది శూన్యపరమొండె ప్రధానపరమొండె కాదు. కావునఁ గారణవిగానము లేదు. | శ్రుతిగతి విప్రతిషేధము । కృతకంబులఁగూర్చిగాని కృతికర్త్రుపురః । *స్కృతమదిగా దవ్యక్త । స్థితిగ బ్రహ్మమె యసదభిధేయంబరయన్॥ |
| ౫॥ జగద్వాచిత్వాధి॥ | ౧౬॥ జగద్వాచిత్వాత్ | "యస్యచైతత్కర్మ" యను వాక్యమునఁ గర్మశబ్దము జగద్వాచక మగుటవలన వేదితవ్యుఁడు పరమేశ్వరుఁడే. | పురుషులకుఁ గర్తమెవ్వం। డరయజగమ్మెవ్వనికర్మ మతఁడీశ్వరుఁడే । వరజీవప్రాణోదా। హరణము జైమినితలంచెనన్యార్థముగాన్॥ ౧౬, ౧౭, ౧౮ సూ॥ |
| | ౧౭॥ జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేత్తద్వ్యాఖ్యాతం॥ | శ్రుతియందు జీవునకును ముఖ్యప్రాణమునకునుగూడ లింగములుండుటవలనఁబ్రకరణప్రతిపాద్యుఁడు పరమాత్మకాఁడంటి | * స్మృతమద్దిగాదు, బ్రహ్మ। వ్యతిరిక్తముగా దసత్పదార్థం బరయన్॥ |

| | | | |
|---|---|---|---|
| | | వేని నావాద మిదివరకే పరిహరింపఁబడినది. | |
| | ౧౮॥ అన్యార్థంతు జైమినిః ప్రశ్న వ్యాఖ్యానాభ్యామపి చైవమేకే॥ | శ్రుతియందలి ప్రశ్నోత్తరముల వలన జీవప్రాణోదాహరణము బ్రహ్మ ప్రతిపత్త్యర్థమని జైమిని తలంచుచున్నాఁడు. మఱియు నీయర్థమునే వాజసనేయులును జెప్పుచున్నారు. | |
| ౬॥ వాక్యాన్వయాధి॥ | ౧౯॥ వాక్యాన్వయాత్ | పూర్వోత్తర వాక్యసమన్వయమువలన మైత్రేయీ బ్రాహ్మణప్రతిపాద్యుఁడు పరమేశ్వరుఁడే కాని జీవుఁడు కాఁడు- | ఆత్మద్రష్టవ్య శ్రుతి।<br>నాత్మపదంబు పరమాత్మ కభిధగనయి జీ।<br>వాత్మపరాత్మలకు నభే।<br>దాత్మత్వము సంఘటించు నన్వయఫణితిన్॥ |
| | ౨౦॥ ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః॥ | "ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" యను ప్రతిజ్ఞాసిద్ధికి, నాత్మద్రష్టవ్యత్వోపదేశము సాధకమై యున్నదని యాశ్మరథ్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు. | ప్రతినగతికాశ్మరథ్యుఁడు।<br>శ్రుతిలింగంబనియె; నౌడులోమివిముక్తా।<br>త్మతకనె నది; బ్రహ్మభా।<br>స్థితికనియెన్ గాశకృత్స్నధీరాగ్రణియున్॥<br>౨౦, ౨౧, ౨౨ సూ॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౨౧॥ ఉత్క్రమిష్యత ఏవంభావా దిత్యౌడులోమిః॥ | ముక్తినిబొందఁబోవు జీవున కట్టి బ్రహ్మైక్యభావ ముండుటవలన జీవద్రష్టవ్యత్వోపదేశము చేయఁబడెనని యౌడులోమిముని యోజింపుచున్నాఁడు. | |
| | ౨౨॥ అవస్థితేరితి కాశకృత్స్నః॥ | బ్రహ్మమే జీవరూపముగా నుండుటవలన జీవోపక్రమణ ముపపన్నమని కాశకృత్స్నాచార్యుఁడు భావింపుచున్నాఁడు. | |

సీ॥ ఆత్మమేద్రష్టవ్యమనునుపదేశంబు పలువిధంబుల నుపపన్నమయ్యెఁ।
బ్రతినసిద్ధినిజేయ పరమలింగంబంచునాశ్మరథ్యుఁడు దానిననువదించె।
సంప్రసాదుని బొందు స్వస్వరూపస్థితి, నలరుచునదియనె నౌడులోమి।
బ్రహ్మాత్మభావంబుఁ బ్రకటించునని తెల్పెఁ, గాశకృత్స్నుఁడు తత్త్వకలితుఁడగుచుఁ॥

తే॥ గీ॥ గారణావస్థలో మోక్షకాలమునను,। సమయభేదంబులేకుండసర్వదశల।
నైక్యసిద్ధిని జెప్పి రాయార్యులోలిఁ। గాశకృత్స్నుని మతమిందు గ్రాహ్యతమము॥

౨౦, ౨౧, ౨౨ సూ॥

| | | | |
|---|---|---|---|
| ౭॥ ప్రకృత్యధి॥ | ౨౩॥ ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్॥ | " యేనాఽశ్రుతం శ్రుతం భవతీ" త్యాది శ్రుతియందలి ప్రతిజ్ఞాదృష్టాంతములకు విరోధము లేకుండుటవలన జగదుపాదానకారణముకూడ బ్రహ్మమే. | ప్రతినయు దృష్టాంతంబును। ("తద్వై బ్రతికూలత లేకయుంటఁ బ్రకృతియును; క్షత" యనుటనిమిత్తంబును,। ద్వితయాత్మక హేతువగుచు వెలసె నొకం ౨౩, ౨౪ సూ॥ (డే॥ |
| | ౨౪॥ అభిధ్యోపదేశాచ్చ॥ | "తదైక్షత" యని యభిధ్యానపూర్వక సృష్టి శ్రుతులయం దుపదేశింపఁ బడియుండుటవలన బ్రహ్మమే నిమిత్తకారణముకూడనైయున్నది. | |
| | ౨౫॥ సాక్షాచ్చోభయామ్నానాత్॥ | ప్రత్యక్షముగాఁ బ్రపంచోత్పత్తిలయములు బ్రహ్మమువలననె కలుగుచున్నవని యుపదేశింపఁబడుటవలన బ్రహ్మమే జగదుపాదానకారణము. | మఱియు:— జగదుత్పత్తిలయంబులు। (న్నే। భగవంతునినుండె యగుట, బ్రహ్మము తె జగదాకృతిగాఁ గలుగుట,। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౨౬॥ ఆత్మకృతేః పరిణామాత్॥ | "తదాత్మానగ్ంస్వయమకురుత" యనుచో బ్రహ్మము తన్నుఁ దానే ప్రపంచరూపముగాఁ జేసికొనినట్లు చెప్పఁబడుటవలనను, "సచ్చత్యచ్చాభవత్" అనుచో బ్రహ్మమే వియదాదిప్రపంచముగాఁ బరిణమించినట్లుపదేశింపఁబడుటవలనను, బ్రహ్మమే జగదుపాదానకారణము. | నిగమములన్ యోనిసంజ్ఞ నెలకొని యుంపూర్వపద్యముతోనన్వయము. (టన్॥* ౨౫, ౨౬, ౨౭ సూ॥ |
| | ౨౭ యోనిశ్చహిగీయతే | "యద్భూతయోని" మిత్యాదిశ్రుతులలో బ్రహ్మము జగదుపాదానమని గానముచేయఁబడుటవలనఁగూడ నదియె యుపాదానకారణము. | * తే॥ గీ॥ సృష్టిసంహారములు బ్రహ్మకృతములగుట। బ్రహ్మమాత్మనెజగనుగాఁ బరిణమింపఁ। జేసికొనిభూతయోనినాఁ జెలగి యుంట। నుభయకారణతయు దానికుచితమగును॥ |

| | | | |
|---|---|---|---|
| ౮॥ సర్వవ్యాఖ్యాతాధి॥ | ౨౮॥ ఏతేనసర్వే వ్యాఖ్యాతాః వ్యాఖ్యాతాః॥ | ప్రధానవాదనిరాకరణము చేతనేతత్సదృశములగు నితరమతములును శ్రుతివిరుద్ధములనినిరూపింపఁబడినది. "వ్యాఖ్యాతాః" అను ద్విరుక్తి యధ్యాయపరిసమాప్తిద్యోతనార్థము. | కాపిలవాదహతిన్ స । ర్వాపవ్యాఖ్యాహతియయి యవిధిస్సనిమిత్తోపాదానక కారణ। మాపరమాత్మయ యటంచుఁ బ్రాప్తంబయ్యెన్॥ |

ఓం తత్సత్.

## ద్వితీయాధ్యాయము. ప్రథమపాదము.

కం॥ స్మృతిబోధ్య యోగబాహ్యా। ద్భుతలక్షణు శిష్టనుతు నభోక్త ననన్యా।
న్నితరాధికు నుపసంహా। రతంత్ర నిరపేక్షు నెంతు రహి నిరవయవున్॥

కం॥ సర్వోపేతాదర్శితు। నుర్వీపవిలాసవ త్ప్రయోజనవంతున్।
నిర్వైషమ్యాకృపాయుతు। సర్వసుధర్మోపపన్ను సంభావింతున్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౧॥ స్మృత్యధి॥ | ౧॥ స్మృత్యనవకాశదోషప్రసంగఇతి చేన్నాన్య స్మృత్య నవకాశ దోషప్రసంగాత్॥ | ప్రధానమునకు జగత్కారణత్వము నంగీకరింపనిచో సాంఖ్యాది స్మృతుల కప్రామాణ్య దోషము ప్రసక్తించు నంటివేని నీవాదము యుక్తము కాదు. ఏలనన బ్రహ్మమునకు జగత్కారణత్వమునంగీకరింపనిచో శ్రుతి సమ్మతములగు మన్వా | *స్మృత్యనవకాశ దోషము। ప్రత్యాసన్నముగు నన్నఁబాడి నొయన్యా। స్మృత్యనవకాశ దోషము। ప్రత్యాసన్నమయి శ్రుతికిఁ బ్రతికూల మగున్॥ |

| | | | |
|---|---|---|---|
| | | దిస్మృతుల కప్రామాణ్యప్ర దోషము ప్రసక్తించును. | ※కపిలస్మృతికప్రామా। ణ్యప్రదోషము సంభవించుననినన్ మన్వా। దిపరస్మృత్యప్రామా। ణ్యప్రదోషము పొసఁగఁగానది యుక్తంబే॥ |
| | ౨॥ ఇతరేషాంచాను పలబ్ధేః॥ | ప్రధానేతరతత్త్వములకు శ్రుతిస్మృతులయం దుపలబ్ధి లేకపోవుటవలన సాంఖ్యస్మృతి యప్రామాణికము. | |
| ౨॥ యోగ ప్రత్యుక్త్యధి॥ | ౩॥ ఏతేనయోగః ప్రత్యుక్తః॥ | ప్రధానవాదనిరాకరణముచేఁ దత్సదృశమగు యోగమతము కూడనిరాకరింపఁబడియె. | శ్రుతిబాహ్యతచే సాంఖ్య। స్మృతి ప్రత్యాఖ్యాతమగుట సృష్టిన్‌దత్తు। ల్యతచేనొప్పెదు యోగ। (దై॥ స్మృతియును బ్రత్యుక్తమయ్యె శిధిలార్థం |
| ౩॥ నవిలక్షణత్వాధి॥ | ౪॥ నవిలక్షణత్వాదస్య తథాత్వంచశబ్దాత్॥ | కారణరూపమైన బ్రహ్మముకంటెఁ గార్యరూపమైన ప్రపంచము విలక్షణముగానుండుటవలన నీప్రపంచమునకు బ్రహ్మము కారణముకాదు. అట్టివైలక్షణ్యము "విజ్ఞానంచావిజ్ఞానంచ" ఇత్యాది శ్రుతులవలనఁ దెలియఁబడుచున్నది. ఇట్లని తార్కికులపూర్వపక్షము. | కారణవైలక్షణ్యాది। కారప్రభవోక్త దోషకలితముకాదా। పూరుష నఖరోమాదుల। సారెకుదృశ్యంబులట్టి జన్మములరయన్॥ ౪, ౫, ౬ సూ॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౫॥ అభిమాని వ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్ | పూర్వోదాహృత శ్రుతులయందుఁ జేతనాచేతన ప్రవిభాగ విశేషముండుటవలనను, శ్రుత్యంతరమందటులనే విభాగము బోధింపఁబడియుండుట వలనను, పృథివ్యాదిభూతాభిమాని దేవతలకే "మృదబ్రవీత్" "తత్తేజఐక్షత" యిత్యాదివాక్యములఁజేతన వ్యాపారముబోధింపఁబడియెఁగాని జడమాత్రమునఁ జేతన లింగములేదని మరల పూర్వపక్షము. | |
| | ౬॥ దృశ్యతేతు॥ | సి॥ కారణముకంటె విలక్షణమగు కార్యోత్పత్తి లోకమున నఖరోమాదులయందును వృశ్చికమశక మత్కుణాదులయందును దృశ్యమగు చుండుటచేఁ బూర్వపక్షమయుక్తము. | |

| | | |
|---|---|---|
| ౭॥ అసదితి చే న్న ప్రతిషేధ మాత్రత్వాత్॥ | సీ॥ ప్రపంచము బ్రహ్మకార్యమనినచో బ్రహ్మవిరుద్ధ ధర్మములుగల ప్రపంచము స్వోత్పత్తికిఁ బూర్వము బ్రహ్మమునందుం డెనని చెప్పఁగిట్టదుగాన వేదాంతమతము న నసద్వాదాపత్తుకలుగునంటివేని నదియు క్తము కాదు. ఏలననఁగానీ ప్రపంచమునకుఁ గాలత్రయమందును గారణాతిరిక్తముగ స్వతంత్రస్థితియే లేదు. | చైతన్యాత్మ బ్రహ్మము। చేతనరూపప్రపంచసృష్టి ఘటింపన్। హేతువననసద్వాదా। పాతమెటఁ? దదన్యకార్యభానమె లేమిన్॥ |
| ౮॥ అపీతౌ తద్వత్ప్రసంగాదసమంజసమ్॥ | పూ॥ సత్కార్యవాదసిద్ధ్యర్థమై కార్యకారణానన్యత్వము నంగీకరించినచోఁ బ్రళయమున వికారాది దోషములు బ్రహ్మమునకుఁ బ్రసక్తించుటచే వేదాంత మతమయుక్తము. | |
| ౯॥ నతుదృష్టాంత భావాత్॥ | ప్రధ్వంసితమగు ఘటాదికము తత్కారణమగు మృదాదికముతో లీనమైనపుడుదాని నెట్లు చెరుపుటలేదో యటులనె ప్రళయ | ఘటకటకాదివికారము। లెటులన్ మృజ్జాతరూప హేతు స్థితిన్। దటమటగాఁ గావింపవా। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | మందు జగత్తుస్వకారణమున లీనమైనపుడు దానిని జెరుపంజాలదు గావునం బూర్వపక్ష మయుక్తము. | యటులన్ జగమాత్మం జెరుప దప్పయమం ౮, ౯ సూ॥ దున్॥ |
| | ౧౦॥ స్వపక్ష దోషా చ్చ॥ | ప్రతిపక్షైక దేశులగుసాంఖ్యులమతమం న నీదోషముండుటవలనంగూడ నౌపనిషద దర్శనమసమంజసమనంగట్టదు. కార్యసత్య త్వవాదులగు నైయాయిక, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసకులమతమున నీదోషమంటును గాని కార్యమిథ్యాత్వవాదులగు వేదాంతులమతమున నీదోషమంటదు. | అసమంజసమనంజనదీ। (దుల్। యసదృశ వేదాంతమతము నల సాంఖ్యా పసనుగస్వపక్షమందే। ప్రసరించుటస్వోక్తదోషబాధలరయంగన్॥ |
| | ౧౧॥ తర్కా ప్రతి ష్ఠానా దప్యన్యథా నుమేయమితిచేదేవ | తర్కముయొక్క యస్థిరతవలనంగూడ స్వపక్షదోష మనివార్యమై యౌపనిషదదర్శనము సమంజసమగు- ఆయప్రతిష్ఠితత్వము | శ్రుత్యనుగృహీతతర్కమె। ప్రత్యేతవ్యంబు మోక్షపథదర్శకమున్। వ్యత్యాసాస్పదఫూరుష। |

| | | | |
|---|---|---|---|
| | మప్యవి మోక్షప్రసంగః॥ | తగలకుండునటుల సాంఖ్య తర్క స్వరూపము యోజింపఁదగిన దంటివేని నన్నితర తర్కములకువలెనె సాంఖ్య తర్కమునకును, అప్రతిష్ఠాన మలంకారమగుటచే దానివలన మోక్షప్రాప్తి కాఁజాలదు. | మత్యనుసారోక్త తర్క మాత్రాద్ధ్రువతన్॥ |
| ౪॥ శిష్టాపరిగ్రహాధి॥ | ౧౨॥ ఏతేనశిష్టాఽపరిగ్రహాఅపివ్యాఖ్యాతాః॥ | ప్రధాన కారణవాద నిరాకరణముచేతనే శిష్టులచేఁ బరిగ్రహింపఁబడనియణ్వాదికారణవాదములును నిరసింపఁబడినవి. | శిష్టాపరిగ్రహాత నప।<br>కృష్టములగు నాకణాదకృతవాదంబుల్।<br>నష్టములగుఁ గపిలమత।<br>భ్రష్టత, నిటెయన్య వేదబాహ్యమతంబుల్॥ |
| ౫॥ భోక్త్రాపత్త్యధి॥ | ౧౩॥ భోక్త్రాపత్తే రవిభాగశ్చేత్స్యాల్లోకవత్॥ | బ్రహ్మమును జీవప్రపంచములునభిన్నములైనచో భోక్తృభోగ్యబ్రహ్మ విభాగములేకపోవునుగాన బ్రహ్మకారణవాదమయుక్తమంటివేని, నిదియొక దోషముకాదు. సముద్రమున ఫేనవీచీతరంగాదులవలె బ్రహ్మమున భోక్తృభోగ్య విభాగము కలుగుచున్నది. | భోక్తృజగద్బ్రహ్మభే।<br>దోక్తిన్ భోక్తృత్వ మాత్మ కొదవెడిననని।<br>ర్వ్యక్తి కమాసిద్ధించు వి।<br>భక్తత పాథోధి ఫేనభంగాదిగతిన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౬॥ ఆరంభణాధి॥ | ౧౪॥ తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః॥ | “వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్య” మ్మనుశ్రుతియందలి యారంభణాది శబ్దములవలనఁ (అనఁగా నసత్యత్వబోధక శబ్దములవలన) గారణమగు బ్రహ్మముకంటెఁ గార్యమగు జగత్తునకభిన్నత్వము తెలియఁబడుచున్నది. | ఆరంభణ శబ్దాదులఁ,\| గారణభావోపలబ్ధిఁ, గార్యస్థితి, నా\| కారాంతరసంప్రాప్తి, వి\| కారము తద్ధేత్వనన్యగతికం బరయన్॥ ౧౪ మొ ౧౬ సూ॥ |
| | ౧౫॥ భావేచోపలబ్ధేః। | కారణ భావమందే కార్యోపలబ్ధి యుండుటవలనను దదనన్యత్వము సిద్ధమగుచున్నది. | |
| | ౧౬॥ సత్త్వాచ్చాపరస్య | “సదేవేదమగ్రఆసీ” త్తనుచోఁగార్యరూపమైన నీప్రపంచమునకు స్వోత్పత్తికిఁ బూర్వముకారణరూపముగా స్థితి యుండుటవలనను గార్యకారణములనన్యములు. | |

౧౭॥ అసద్వ్యపదేశాన్నేతిచేన్న, ధర్మాంతరేణ వాక్య శేషాత్॥

"అసదేవేదమగ్ర ఆసీ" త్తనుచో సృష్టికిఁ బూర్వముసద్వ్యవహారముండుటవలననప్పుడు కార్యమునకు సత్త్వములేదంటివేని నదియుక్తముకాదు. శ్రుత్యుత్తరవాక్యమువలన రూపాంతరముతో నసఁగాన వ్యక్తస్వరూపముతో సృష్టికిఁ బూర్వమది యున్నట్లు బోధింపఁబడియె.

౧౮॥ యుక్తేశ్శబ్దాంతరాచ్చ॥

"దధిఘటరుచకాద్యర్థియగువానిచేనావస్తువులకుఁ బ్రతినియతకారణములగుక్షీరమృత్తికాసువర్ణాదులే సంగ్రహింపఁబడుచుండుటచేఁ గార్యముకారణమునందభిన్నసత్తాక"మనుయుక్తివలనను, "సదేవేదమగ్రఆసీ" త్తను శ్రుత్యంతరమువలనను, గార్యసత్త్వమును గారణానన్యత్వమును సిద్ధింపుచున్నవి.

దధిఘట రుచకాద్యర్థికి।
విధితప్రతినియత హేతువిచయముగా నన్।
ప్రథితముతదనన్యత్వం।
బధీతమివ్విధముగానె యన్యశ్రుతిలోన్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౧౯॥ పటవచ్చ॥ | సంవేష్టితప్రసారిత పట న్యాయమునఁ గార్యమగు జగత్తు కారణమగు బ్రహ్మము కంటె నన్యము. | సంవేష్టితప్రసారణ।<br>సంవర్ధితపటముభంగి జగదీశ్వరులన్।<br>సంవేద్యులభిన్నులుగా।<br>సంవహ నానాత్వమువలెఁ జను నాత్మగ<br>౧౯, ౨౦ సూ॥ (తుల్॥ |
| | ౨౦॥ యథాచప్రాణాదిః॥ | ఒకటే వాయువెట్లు పంచవృత్తులు కలదగుచున్నదో యటులనే యొకటగు బ్రహ్మము నానాత్వమును బొందుచున్నది. | |
| ౭॥ ఇతర వ్యపదేశాధి॥ | ౨౧॥ ఇతర వ్యపదేశాద్ధితాకరణాదిదోష ప్రసక్తిః॥ | పూ॥ జీవునకు బ్రహ్మాభిన్నత్వోపదేశమువలన (లేక బ్రహ్మమునకే జీవత్వవ్యవహారమువలన) సృష్టియందు హితాకరణాహితకరణ దోషములు ప్రాప్తించును. | ఇతరాభేదవ్యపదే।<br>శతనుహితాకరణ దోషసంగమగుననన్।<br>ద్వైతనిర్దిష్టతనీశుం।<br>డతిశయితుఁడుగల్గు సర్వమశ్మాదివలెన్॥<br>౨౧, ౨౨, ౨౩ సూ॥ |
| | ౨౨॥ అధికంతు భేదనిర్దేశాత్॥ | ఈశ్వరునికంటె జీవుఁడుభిన్నుఁడని వ్యవహారదశయందు నిర్దేశింపఁబడియుండుట | |

| | | | |
|---|---|---|---|
| | | వలన జీవునికంటె నీశ్వరుఁడధికుఁడు. కావునఁబూర్వోక్తమయుక్తము. | |
| | ౨౩॥ అశ్మాదివచ్చతదనుపపత్తిః॥ | . ఒక్క-టేయగుపృథివికిమణిసూర్యకాంతపాషాణాది వైచిత్ర్యముకలుగుచున్నట్లుగానే యఖండైక బ్రహ్మమునకు జీవేశ్వర ప్రపంచ భేద వైచిత్ర్యము గలుగుచున్నది. కావునఁబరపరికల్పిత దోషానుపపత్తి కలుగుచున్నది. | |
| ౮। ఉపసంహారదర్శనాధి॥ | ౨౪॥ ఉపసంహారదర్శనాన్నేతిచేన్నక్షీరవద్ధి॥ | కార్యోత్పత్తికిఁబూర్వముసామగ్రీసంగ్రహము లోకమున దృశ్యమగుచుండుటవలనఁ బ్రపంచ మీశ్వర కృత్యమను ప్రతిజ్ఞ యుక్తముకాదంటివేని నీవాదమయుక్తము. పాలుసహజముగా దధియగుట ప్రసిద్ధముగదా! | పరికరములు లేకున్నను। బరమాత్మకమేయు నైజబలమునవచ్చున్। బరిణామితపాలకువలె। బరగున్ దేవాదిసృష్టివలెఁ దత్సృష్టుల్॥ ౨౪, ౨౫ సూ॥ |
| | ౨౫॥ దేవాదివదపిలోకే॥ | ప్రపంచమందు దేవఋషి పితృవర్గము | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | వలెనె బ్రహ్మమునకు విచిత్రనిర్మాణశక్తి కలదు. | |
| ౯॥ కృత్స్న ప్రసక్త్యధి॥ | ౨౬॥ కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వ శబ్దకోపోవా॥ | పూ॥ బ్రహ్మము నిరవయవమగుటచే యావద్బ్రహ్మమును జగత్తుగాఁ బరిణమించినదని ప్రసక్తింపుచున్నది. (ఇట్లయినచో మూలోచ్ఛేద ప్రసక్తియు ద్రష్టవ్యత్వోపదేశానర్థక్యమును గలుగును; ఈవిరోధపరిహారార్థమై బ్రహ్మము సావయవమని చెప్పినచో) బ్రహ్మము నిరవయవమని చెప్పు శ్రుతికి విరోధముకలుగును. | నిరవయవంబనఁ గృత్స్నవి। పరిణామాపత్తి రూపబాధయొదవుఁద। త్పరిహృతికై యన్యంబన। నిరవయవత్వాది శబ్దనిరసనమెసఁగున్॥ |
| | ౨౭॥ శ్రుతేస్తుశబ్దమూలత్వాత్॥ | వికారాత్మక ప్రపంచ వ్యతిరేకముగా బ్రహ్మమున కవస్థానమును జెప్పు శ్రుతి యుండుటవలనఁ గృత్స్నప్రసక్తిదోషము | భూతాదికపాదశ్రుతి। భాతిన్గృత్స్న పరిణామబాధాపగమం। బైతగునిరవయవంబే। |

| | | |
|---|---|---|
| | తగలదు. మఱియు, నిరవయవబ్రహ్మమే జగత్కారణమను విషయము వేదప్రమాణముకలదగుటవలన సావయవత్వకల్పనయందుఁజెప్పబడిన నిరవయవత్వ శబ్ద కోపము సంభవింపదు. కావునఁ బూర్వపక్షములు యుక్తములుకావు. | భూతనిదానంబు శబ్దమూలంబిదియన్॥ |
| ౨౮॥ ఆత్మనిచైవంవిచిత్రాశ్చహి॥ | ఏకారణమువలన నీప్రకారము గానే (స్వస్వరూపముచెడకయె) జీవునియందును (స్వప్నసాక్షియందును) విచిత్రసృష్టులుదృష్టములగుచున్నవో యటులనే స్వరూపానుపమర్దములేకయె యొక్కటగుబ్రహ్మమునందు విచిత్రాకారసృష్టి కలుగుచున్నది. | నిజరూపాక్షతి శుక్తిన్।<br>రజతముభాసిల్లుభంగి బ్రహ్మమునందె।<br>ల్లజగంబులు భాసిల్లెడు।<br>నిజమగునిటు చిత్రసృష్టి నెరినాత్మలకున్॥ |
| ౨౯॥ స్వపక్షదోషాచ్చ | ప్రధానాణువాదములయందు దోషములుండుటవలనను నిరవయవబ్రహ్మమె జగత్తునకు వివర్తోపాదాన కారణమని స్థిరపడుచున్నది. | పరమతము దోషయుక్తము।<br>పరుఁడు వివర్తప్రకృతి ప్రపంచంబునకున్।<br>బరికింపనతఁడొకింతయుఁ।<br>బరిణామప్రకృతి కాఁడుపరుఁను రీతిన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహతాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| ౧౦॥ సర్వోపేతాధి॥ | ౩౦॥ సర్వోపేతాచతద్దర్శనాత్॥ | సృష్టికర్త్రియగు పరదేవతయనఁగాబరమాత్మ సర్వశక్తి సహితుఁడని శ్రుతిప్రదర్శింపుచుండుటచే విచిత్రప్రపంచకరణసమర్థమగు మాయకు వాఁడాశ్రయుఁడు. | సర్వోపేతుండగుటను। సర్వేశ్వరుఁ డెట్టికరణ సముదయము జగన్నిర్వాహముకై కోరక। సర్వార్థంబులను జేయుజ్ఞానేచ్ఛలతోన్॥ ౩౦, ౩౧ సూ॥ |
| | ౩౧॥ వికరణత్వాన్నేతిచేత్తదుక్తం॥ | శరీరాదిసాధనములు లేకపోవుటవలన బ్రహ్మము జగత్కారణము కాఁజాలదంటివేని నాదోష పరిహార మిదివరకే చెప్పఁబడియె. | |
| ౧౧॥ ప్రయోజనవత్త్వాధి॥ | ౩౨॥ నప్రయోజనవత్త్వాత్॥ | పూ॥ ప్రవృత్తులు ప్రయోజనవిశిష్టములగుటవలనఁ బరమాత్మ జగత్కర్తయైయుండఁజాలదు. | లోకమునవ్యర్థవృత్తులు। లేకుండుట తథ్యమైన లీలార్థంబై। లోకేశుఁడు చెలఁగెడు భూ। లోకేశులక్రీడరీతి లోలతలేమిన్॥ ౩౨, ౩౩ సూ॥ |

| | | | |
|---|---|---|---|
| | ౩౩॥ లోకవత్తు లీలా కైవల్యం॥ | లోకమునఁ బ్రభువుల క్రీడా విహారాదులవలెనే యీశ్వరసృష్టి లీలామాత్రప్రయోజనము కలది. కావునఁ బూర్వపక్షమయుక్తము. | |
| ౧౨॥ వైషమ్య నైర్ఘృణ్యాధి॥ | ౩౪॥ వైషమ్య నైర్ఘృణ్యే, న, సాపేక్షత్వాత్తథాహిదర్శయతి॥ | జీవధర్మాధర్మాపేక్ష యుండుటవలనఁ బాక్షిక నిర్దయత్వము లీశ్వరునకుఁ బ్రసక్తింపవు. అటులనేకదా శ్రుతియుఁ జెప్పుచున్నది. | వైషమ్యనిర్ఘృణత్వము లిషణ్మాత్రమును జెందవీశ్వరు, దోషా। దోషాపేక్షనులయ్యావి। యాపడనాదుల నవిద్యయన్నిటిఁగూర్చున్॥ ౩౪, ౩౫, ౩౬ సూ॥ |
| | ౩౫॥ నకర్మావిభాగాదితి చేన్నానాదిత్వాత్॥ | వైచిత్ర్యహేతువగు విభాగములేకపోవుటవలన సుకృతదుష్కృత కర్మము విషమసృష్టికిఁ గారణమై యుండఁ జాలదంటివేని నాదోషము ప్రసక్తింపదు. ఏలననఁగా సంసారమనాది. | |
| | ౩౬॥ ఉపపద్యతే చాప్యుపలభ్యతేచ॥ | • సంసారమునకనాదిత్వముపపన్నమగుచున్నది; మఱియుఁ బ్రమాణసిద్ధమగుచున్నది | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౧౩॥ సర్వధర్మోపపత్త్యధి॥ | ౩౭॥ సర్వధర్మోప పత్తేశ్చ॥ | సర్వజ్ఞత్వ,సర్వశక్తిత్వ, మహామాయిత్వాదిజగత్కారణ ధర్మములన్నియు బ్రహ్మమందు పపన్నములగుటవలన నౌపనిషదదర్శనము సమంజసము. | గుణరహితంబగు బ్రహ్మము।<br>గుణవంతంబగు ప్రపంచకోటికిఁబీజం।<br>బనఁదగు, సర్వజగత్కా-।<br>రణతాధర్మోపపత్తి రహినందుంటన్॥ |

ఓం తత్సత్.

# బ్రహ్మసూత్రార్థసంగ్రహము.

## ద్వితీయాధ్యాయము. ద్వితీయపాదము.

తే॥గీ॥ సాంఖ్యగౌతమ కాణాదశాస్త్రవిమతు। బౌద్ధజైనాగమాబోధ్య భావసహితుఁ।
పాశుపత పాంచరాత్రానుబంధ రహితు। వేదశబ్దైక వేద్యుని వినుతిఁజేతు॥

ఒండొః మ॥ అచిచిత్ప్రకృతిమ త్ప్రపంచ రచకున్ హ్రస్వాణుబీజంబుఁ ద।
ద్గత సంయోగ వియోగ కారకుని బౌద్ధప్రక్రియాదూరు హ్రా।
ద్గతవిజ్ఞాన వికారమాత్ర పరయోగాచార బాహ్యస్థు నా।
ర్హత శైవాగమ పాంచరాత్ర విముఖ బ్రహ్మంబు నేఁ గొల్చెదన్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందము ల. |
|---|---|---|---|
| ౧॥ రచనానుపపత్త్యధి॥ | ౧॥ రచనానుపపత్తేశ్చ నానుమానం. | విచిత్ర ప్రపంచ రచన కనుగుణమగు యుక్తి లేకుండుటవలనఁ బ్రధానము జగత్కారణముకాదు. | వివిధప్రపంచరచనా। (ప్రయో।) ప్రవృత్త్యనుపపత్తి (న్) సహజ వర్తనము బువులకు నైనను లేమిన్। భువన నిదాన మనుమానముగఁ దగదనఁ గన్॥ |
| | ౨॥ ప్రవృత్తేశ్చ॥ | బుద్ధిపూర్వక ప్రయత్న విశేషమునక | ౧, ౨, ౩ సూ॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | నుగుణమగు యుక్తి లేకుండుటవలనను ప్రధానము జగత్కారణముకాదు. | |
| | ౩॥ పయోంబువచ్చేత్తత్రాపి॥ | క్షీరోదకములవలె (సహజముగానె ప్రధానము ప్రయోజనకారి కావచ్చు) నంటి వేని వానియందును బ్రవృత్తి కన్యసంబంధముకలదు. | |
| | ౪॥ వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్॥ | ప్రధానముకంటె వ్యతిరిక్తమగు వస్తువులేకుండుటవలనను, అదిసహాయాంతరాపేక్ష లేనిదగుటవలనను, ప్రధానము జగత్కారణముకాదు. | వ్యతిరేకపదార్థాసం।<br>స్థితినొప్పి ప్రధానమన్య నిరపేక్షంబై।<br>గతిగొనఁబురుషులునిల్లి।<br>ప్తతనొప్పన్స్మార్తమెట్లుభవకారణమౌ॥ |
| | ౫॥ అన్యత్రాభావాచ్చనతృణాదివత్॥ | క్షీరపరిణామ నిమిత్తమగు ధేనువుకంటె నన్యమగుచోట్ల (ననఁగా వృషభాదుల | తృణజలములు గోగణభ।<br>క్షణముననే క్షీరములగుఁగా వెల్లెడనా। |

| | | |
|---|---|---|
| | యందుఁ) తృణాదికమునకు క్షీరపరిణామము లేకపోవుటవలనఁ దృణపల్లవాదులకువలెనె ప్రధానమునకు సహజ పరిణామము లేదు. | యనుమానంబిటులనె చే। తననిరపేక్షనుఁగఁబొందఁదగదుపరిణతిన్॥ |
| ౬॥ అభ్యుపగమేఽప్యర్థాభావాత్॥ | ప్రధానమునకు జగత్సృష్ట్యనుకూల ప్రవృత్తి స్వాభావికమని యంగీకరించినను, అట్టిప్రవృత్తికిఁ బ్రయోజనము లేకపోవుటవలన సాంఖ్యమతమందలి దోషమనివార్యము. | సహజ ప్రవృత్తి యొప్పను। పహితార్థాభావమగును,బంగ్వంధులకున్।* సహమేళన గతియనస్వము। తసాఁనివచ్చు నిటుగానఁదగు గపిలువిడన్॥ ౬, ౭ సూ॥ |
| ౭॥ పురుషాశ్మవదితిచేత్తథాపి॥ | పంగు పురుషాయస్కాంతములవలెనె పురుషప్రేరణమువలనఁ బ్రధానము ప్రవర్తింపుచున్నదనినను దోషమనివార్యము. | |
| ౮॥ అంగిత్వానుపపత్తేశ్చ॥ | త్రిగుణములు పరస్పరమునంగాంగిభావమును బొందుట కుపయుక్తి లేకపోవుటవలనను(ప్రధానమునకు ప్రవృత్తిసిద్ధింపదు.) | నంగగు దోషానుషంగ మనివార్యంబై॥ |

* పంగుజనాయస్కాంతో। (గిన్। త్సంగమ ఘటితాంధ లోహచలనము భంబొంగా రుఁబ్రధానంబను।

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ౯॥ అన్యథానుమితౌ చ జ్ఞశక్తివియోగాత్। | వేరువిధముగా (సనగా గుణములు సాపేక్షములని) ననుమానము చేసినను బ్రధానమునకు జ్ఞానశక్తి లేకపోవుటవలనఁ (బూర్వోక్త రచనానుపపత్తి ప్రవృత్త్యభావాదిదోషము లనివార్యములు.) | త్రిగుణమ్ములు వైషమ్యో। (సా। పగమాయోగ్యములు, జ్ఞత్వబల శూన్యం త్రిగుణాత్మిక, విప్రతిషే। ధగతంబు మతంబు, గానఁదగుఁ గపిలు వి (డన్॥ ౮, ౯, ౧౦ సూ॥ |
| | ౧౦॥ విప్రతిషేధాచ్చాసమంజసం॥ | సాంఖ్యమత సిద్ధాంతములయందుఁ బరస్పర విరోధముండుటవలనను సాంఖ్యదర్శనమయోగ్యము. | |
| ౭॥ మహద్దీర్ఘాధి॥ | ౧౧॥ మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్॥ | ద్వ్యణుక పరమాణువుల వలనఁ ద్ర్యణుకద్వ్యణుకోత్పత్తివలెనె చేతనమగు బ్రహ్మమునుండి యచేతనమగు జగత్తు పుట్టుచున్నది. | పరిమండల హ్రస్వంబులఁ। బరదీర్ఘ మహత్వదార్థభవ మగుచుండన్। బరునుండి తద్విలక్షణ। తరలోకోత్పత్తి గాఁగఁదగదె తలంపన్॥ |

| | | | |
|---|---|---|---|
| ౩॥ ఉభయథాధి॥ | ౧౨॥ ఉభయథాపినక ర్మాఽతస్తదభావః॥ | అణుకర్మనిమిత్తము కలదనినను లేదనినను, పరమాణువులయందు సంయోగ వియోగ జనకీభూతమగు నాద్యకర్మముసంభవింపదు. కావునసృష్టి ప్రళయాభావము కలుగుచున్నది. | అణుకర్మ నిమిత్తముకల। దనినన్ లేదనిన రెండు న్యాయంబులయం। దణుకర్మమసంభవమై। చనవుత్పత్తి ప్రనాశసంతానంబుల్॥ |
| | ౧౩॥ సమవాయాభ్యుపగమాచ్చసామ్యాదనవస్థితేః॥ | (వైశేషికమతమున) సమవాయిసంబంధము పదార్థముగా నంగీకరింపఁబడియుండుటవలనఁగూడ సృష్ట్యభావమగుచున్నది. ఏలననఁగా ద్వ్యణుకమునకును సమవాయమునకును బరమాణుభిన్నత్వవిషయమున సామ్యముండుటనుబట్టి యనవస్థాదోషము కలుగుచున్నది. | సమవాయం బణువులతో। సమమైన పదార్థమంచు సమ్మతిగనుటన్। సమవాయ ద్వ్యణుకములణు। సమభిన్నములగుట సంధిసంభవమెల్లా॥ |
| | ౧౪॥ నిత్యమేవచ భావాత్॥ | ప్రవృత్తినివృత్త్యుభయానుభయస్వభావములలో నొకభావమునుమాత్రమె పరమాణువులు కలవగుటవలన సృష్టిప్రళయ | ఊని ప్రవృత్తినివృత్త్యుభ। (భావం। యా నుభయ విధగతులఁ బరమాణువు లానొకఁడే నిత్యముగాఁ। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | ములలో నెద్దియోయొకటిమాత్రమె నిత్య<br>మగుచున్నది. | గానcబోసcగు నేకరీతికార్యచయంబుల్॥ *<br>* అణువులకుc బ్రవృత్తియె కల। (యం।<br>దనసృష్టియె యగునివృత్తియ యనన్ బ్రళ<br>బనువగు నుభయానుభయను।<br>లనొకటన నిరర్థకతయలబ్ధమగుగదా॥ |
| | ౧౫॥ రూపాదిమత్త్వా<br>చ్చవిపర్యయో దర్శ<br>నాత్॥ | పరమాణువులు రూపాదిమంతము ల<br>నcబడుటవలనను, రూపాదికముగల వస్తు<br>వుసావయవముగ ననిత్యముగ లోకమున<br>దృశ్యమగుటవలనను, అణువుల కణుత్వని<br>త్యత్వహాని కలుగుచున్నది. | ఎయ్యదిరూపాదియుతం: (పం।<br>బయ్యది సావయవమగుట, నణునకు రూ<br>బియ్యకొనంబడి యుండుట,।<br>ద్రవ్యాలగునణుత్వమెల్ల వ్యత్యస్తంబై॥ |
| | ౧౬॥ ఉభయథాచదో<br>షాత్॥ | పృథివ్యాదిపరమాణువులధికగుణోపేత<br>ములని చెప్పిన నల్పగుణోపేతములని చెప్పి | భూజలతేజో వాయ్వణు।<br>బీజములధి కాల్పగుణ విభేదంబులలో। |

| | | | |
|---|---|---|---|
| | | నను దోషముండుటవలనఁ బరమాణుకారణవాదమయుక్తము. | నేజాతింగలవన్నను।<br>నై జాణుత్వాది ధర్మనయముందప్పున్॥ * |
| | | | *పృథివీజల తేజోవా।<br>య్వాధిగతపరమాణువులకు నధికాల్పగుణ।<br>ప్రథిమాప్రథిమల జేనిన్।<br>గధింబినననణుత్వహానికలము ఘటించున్॥ |
| | ౧౭॥ అపరిగ్రహాచ్చాత్యన్తమనపేక్షా॥ | శిష్టపరిగ్రహము లేకపోవుటవలనను వైశేషికమత మత్యంత మనాదరణీయము. | ఆదరణీయ మొకింతయుఁ।<br>గాదాకాణాదవాద కాండంబరయన్।<br>వేదాంతప్రతిషిద్ధత।<br>నాదృత శిష్టాపరిగ్రహత్వము వలనన్॥ |
| ౪॥ సముదాయాధి॥ | ౧౮॥ సముదాయఉభయహేతుకేపి తదప్రాప్తిః॥ | బాహ్యాభ్యంతర పదార్థద్వయము హేతువుగాఁగలది శరీరాదిసంఘాతమని చెప్పినను, (ఘటకుఁడు లేకుండుటచే) సంఘాతప్రాప్తి కాజాలదు. | సౌగతమొప్పుచునుండును।<br>బాగుగసౌత్రాంతికమును వైభాషికమున్।<br>వీగదుయోగాచారము। (లన్॥<br>నాగన్ మాధ్యమిక మనఁగ నాల్గు తెఱఁగు |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ౧౯॥ ఇతరేతర ప్రత్యయత్వా దితిచేన్నో త్పత్తిమాత్రనిమిత్తత్వాత్॥ | అవిద్యా సంసారవిజ్ఞాన నామరూపేంద్రియస్పర్శ వేదనా తృష్ణాప్రవృత్తి ధర్మాధర్మ జన్మ జరామరణ శోకపరిదేవనా దుఃఖాదులు పరస్పరనిమిత్త నైమిత్తికములగుటవలన హఠాత్తుగ సంఘాతసిద్ధియగుచున్నదంటివేని నట్లు కాఁజాలదు; ఏలననఁగ బూర్వపూర్వపదార్థములుత్తరోత్తర పదార్థముల యుత్పత్తికి మాత్రము కారణముగానుండుటవలన (సంఘాతసిద్ధినిగాని లోకయాత్రనుగాని జేయ సమర్థములుకావు.) | బాహ్యాంబనుమేయంబే;। (గా।<br>బాహ్యము ప్రత్యక్షగతము; ప్రత్యయగతి<br>గ్రాహ్యాంబది; శూన్యముగా। (ముల్॥<br>సూహ్యాంబంతయు; ననఁదగు వాగి నీమత<br>సర్వముదుఃఖంబనుచు। (యున్।<br>స్సర్వము క్షణికము స్వలక్షణంబును మఱి<br>సర్వముశూన్యంబుననుచు।<br>సర్విన్భావింపఁగనుమహాదయమబ్బున్॥<br>దేహాదికసంఘాతము। (ని।<br>బాహిరమంతరముననెడి ప్రకృతిద్వయి(న్)<br>ర్వాహితమగు ననఘటకుని।<br>సాహాయ్యములేకకావు సంఘాతంబుల్॥<br>౧౮ సూ॥ |

| | | సతతావిద్యాజన్మము।<br>లితరేతర హేతువులన నెగ్గగునేకై।<br>కతగోత్పత్తికవినిమి।<br>త్తతఁబొందిన సంఘసిద్ధితగవు ఘటింపన్॥<br>౧౯ సూ॥ |
|---|---|---|
| ౨౦॥ ఉత్తరోత్పాదేచ పూర్వనిరోధాత్॥ | ఉత్తరక్షణీయవస్తూత్పత్తిసమయమందుఁ బూర్వక్షణీయవస్తువు లేకపోవుటవలన నవిద్యాదుల కుత్పత్తిమాత్ర నిమిత్తత్వముకూడ సంభవింపదు. | ఉత్తరపదార్థమయ్యెడు।<br>నత్తరిఁ బూర్వపుపదార్థ మంతమగుటను।<br>త్పత్తియుఁగూడనవిద్యా।<br>యత్తముకాఁజాలదంచు వ్యక్తమగుగదా॥ |
| ౨౧॥ అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్య మన్యథా॥ | కారణములేకయే కార్యోత్పత్తియగునంటివేని స్వప్రతిజ్ఞా హాని కలుగును. ఉత్తర క్షణోత్పత్తి పర్యంతము పూర్వ క్షణముకూడ నిలిచియుండునను పక్షమునఁ గార్య కారణముల కేకకాలోత్పత్తి కావలసివచ్చును. | హేతువులేకయె క్రియసం।<br>భూతంబగునన్నఁ బ్రతినపోవుఁగ్రియసం।<br>భూతమగుదనుకనిల్చును।<br>హేతువనన్యౌగపత్య హేడనమొదవున్॥ |
| ౨౨॥ ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాప్రా | హేతుఫలభావరూపకమగు ప్రవాహమునకును బదార్థములకును డెంపు లేకపో | సతతంబులు హేతుఫల।<br>ప్రతతియువస్తుప్రవాహ భావమునగుటన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ప్తిరవిచ్ఛేదాత్॥ | వుటవలన, జ్ఞానపూర్వకమైనట్టియు నజ్ఞానపూర్వకమైనట్టియు వినాశము యొక్కయ సంభవముకలుగుచున్నది. అనఁగావానికి బుద్ధిపూర్వకవినాశముగాని యాకస్మికవినాశముగాని ప్రతిక్షణముసంభవింపదు. | ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యా। (గదా॥ ప్రతి రోధాఽ ప్రాప్తి దుర్నివార్యంబు |
| | ౨౩॥ ఉభయథాచదోషాత్॥ | అవిద్య సమ్యగ్జ్ఞానమువలన నశింపుచున్నదనినను, స్వయముగానే నశింపుచున్నదనినను, దోషముప్రసక్తించుటవలన (నీమతమునింద్యము.) | విమలజ్ఞానమవిద్యను। సమయించు ననఁగ నప్రతిసంఖ్యా నాశం। బమరదదిపోవుస్వయమన। యమాదిమార్గోపదేశ మతివ్యర్థంబా॥ |
| | ౨౪॥ ఆకాశేచాఽ విశేషాత్॥ | ఆకాశమందును బృథివ్యాదివస్తువులకంటె విశేషము లేకుండుటవలన (నదిభావపదార్థమేకాని శూన్యముకాదు.) | ద్వివిధనిరోధంబులవలె। దివియునునిరుపాఖ్యమనుచుఁ దిలకించినవ। స్త్వవిశేషంబాకాశం। బవుటఁదగదు దానిశూన్యమనినుడువంగన్। |

| | | | |
|---|---|---|---|
| | ౨౫॥ అనుస్మృతేశ్చ॥ | అనుభవానుసారమైన స్మృతి యుండుటవలన (జ్ఞాతకు క్షణికత్వము సిద్ధింపదు) | క్షణికముసర్వంబనుటన్।<br>క్షణికమె జ్ఞాతయును జ్ఞానసంతానమునై।<br>చను; నిదిసరికాదెల్లర। (టన్॥<br>కనుభవసదృశంబగు స్మృతి యాగతమగు |
| | ౨౬॥ నాఽసతోఽదృష్టత్వాత్॥ | కారణనాశమందుఁ గార్యోత్పత్తియగుట యెందునుగన్పట్టకుండుటవలన నభావగ్రస్తమగు పదార్థమునుండి కార్యోత్పత్తి కాఁజాలదు. | కలుగదసత్తున సత్త్వము।<br>కలుగమిఁ గారణ విహీన కార్యోత్పత్తుల్।<br>కలిగెనొ ధరణినుదాసీ।<br>నులకున్ సిద్ధించు నన్నినుడివిన మాత్రన్॥<br>౨౬, ౨౭ సూ॥ |
| | ౨౭॥ ఉదాసీనానామపిచైవంసిద్ధిః॥ | అభావము నుండి వస్తుసిద్ధియగు పక్షమునఁ బ్రయత్నముచేయక యూరకే యున్నవారికిఁగూడఁ గార్యసిద్ధి కావలసియుండును. | |
| ౫॥ నాభావాధి॥ | ౨౮॥ నాభావఉపలబ్ధేః॥ | విజ్ఞానేతరపదార్థములకు భావములేదంటివేని, బాహ్యార్థస్ఫూర్తి యుండుటవలన నది యుక్తముకాదు. | ఖంబేసర్వంబునిరా।<br>లంబనవిజ్ఞాన మాత్రలక్షణ సద్భా।<br>వంబదియని యాగాచా।<br>రంబువిడంబించుఁ గర్ణరమణీయంబై॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|

౩౦ బాహ్యాభ్యంతర పదార్థము లెవ్వియు లేకపోవుటచే వాసనావైచిత్ర్యమైనను లేక సర్వప్రమాణసిద్ధమగు లోకవ్యవహారమే లోపించును.

౩౧ పదార్థములకు క్షణకాల సద్భావమైన నంగీకరింపబడుటచే సర్వశూన్యత్వవాదమునకు బాధకము కలుగుచున్నది.

౩౨ అన్నివిధముల మాధ్యమికమత మనుపపన్నము.

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౬॥ నైకస్మిన్నధి॥ | ౩౩॥ నైకస్మిన్న సంభవాత్॥ | ఏకవస్తువునందు సదసత్త్వాది విరుద్ధధర్మసమావేశము శీతోష్ణములవలె నేక కాలమందు సంభవింపకుండుటవలన జైనమతము యుక్తియుక్తముకాదు. | ఆర్హతమతమార్యాదర।<br>నార్హముకాదుయుగపత్సమావేశంబుల్।<br>దుర్హితధర్మంబులకున్।<br>గర్హితములసంభవములుగానుండుటచేన్॥ |
| | ౩౪॥ ఏవంచాఽత్మాకార్త్స్న్యమ్॥ | ఇదియునుగాక (జీవుడు దేహానురూపపరిమాణకుడైనచో) వానికి (కొన్ని దేహములన్నపరిపూర్ణత్వము ప్రసక్తించును. | ఏకపదార్థంబందున।<br>నేకాంతత్వంబు సంభవింపమిచేనా।<br>త్మాఽకృత్స్నత్వాఽనిత్య।<br>త్వాఽకులతన్ జైనమతమనర్థప్రదమా॥ |

| | | | |
|---|---|---|---|
| | ౩౫॥ నచపర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః॥ | జీవావయవములాగమాపాయముఁగుట వలనఁ బూర్వోక్త విరోధము లేదంటివేని, నీపక్షమున జీవునకు వికారాది దోషము లు ప్రసక్తించుటచే విరోధ పరిహారను కాఁజాలదు. | జీవాంశంబులు వచ్చుచుఁ।<br>బోవుచు నుండెదుననంగఁ బొరిజీవునకున్।<br>సావయవత్వానిత్య।<br>త్వావాప్తిన్ బంధమోక్షహాని ఘటించున్॥ |
| | ౩౬॥ అంత్యావస్థితేశ్చోభయ నిత్యత్వాదవిశేషః॥ | మోక్షావస్థా భావియగు జీవపరిమాణమునకు నిత్యత్వ ముండుట వలనను, తత్పూర్వశరీరపరిమాణములకుఁగూడ నిత్యత్వము సిద్ధమగుటవలనను, దేహానుగుణపరిమాణ విశేషము జీవునకుండఁ జాలదు. | మఱియు:—<br>ఎందుండివచ్చుచుండునో।<br>యెందులకే తెంచునో క్రొయీజీవాణుల్।<br>పొందుగ నెవియాత్మాణులో,<br>యందెయ్యవిగావొ చెప్పనవశంబుగదా॥ |
| ౭॥ పత్యురసామంజస్యాధి॥ | ౩౭॥ పత్యురసామంజస్యాత్॥ | సామరస్యము లేకపోవుటవలన నీశ్వరునకు నిమిత్త కారణత్వ మాత్రముపొసఁగఁజాలదు. | పశుపాశ విమోక్షార్థము।<br>పశుపతి వస్తువులనైదు భంగులఁజేసెన్।<br>పశుపతి నిమిత్తమాత్రమె।<br>పశుమాయలు వేఱటంద్రు పాశుపతీయుల్॥ |
| | ౩౮॥ సంబంధానుపప | ఈశ్వరునకును బ్రధాన పురుషులకును | ఈశునకు నిమిత్తత్వమె। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | త్తేశ్చ॥ | సంబంధము సందర్భింపక పోవుట వలనఁ గూడ (నీశ్వరునకు నిమిత్త కారణత్వ మాత్రము పొసఁగఁజాలదు). | పాశుపతన్యాయయోగ పర సాంఖ్యులస।<br>ద్వైశేషికతంత్రంబులు।<br>కౌశలముగఁ జెప్పదోషగంధము వచ్చున్॥ |
| | ౩౯॥ అధిష్ఠానానుపపత్తేశ్చ॥ | ప్రధానాదుల యందీశ్వర వ్యాపార యోగ్యత లేకపోవుటవలనఁగూడ నీశ్వరుఁడు నిమిత్త కారణ మాత్రమనఁగిట్టదు.<br>అర్థాంతరము:— స్వవ్యనుకూలవ్యాపారమున కర్హమగు శరీరాద్యధిష్ఠాన మీశ్వరునకు లేకుండుటవలనఁగూడ (నతఁడు జగత్తునకు నిమిత్త కారణమనఁ గిట్టదు.) | పరపురుష ప్రకృతిపర।<br>స్పర సంబంధోపపత్తి సమకూడమిచేఁ।<br>బరమాణు ప్రముఖంబులు।<br>పరమేశ్వర కర్మయోగ్యవస్తులు కామిన్॥<br>పూర్వాన్వయము. |
| | ౪౦॥ కరణవచ్చేన్నభోగాదిభ్యః॥ | మొదటియర్థము:— (1)<br>ఇంద్రియము జీవునకధిష్ఠానమైనట్లుగా | కరణంబులు పురుషన కుప।<br>కరణంబులుగాను జగతిఁ గడుకొను రీతిన్।<br>బరుసకుఁ బరమాణ్వాదులు। |

(1) సాధనము.

| | | | |
|---|---|---|---|
| | | నే ప్రధానాదు లీశ్వరునకధిష్ఠానము కావచ్చునంటివేని, వానికి భోగాదిసామ్యము కలుగుటవలన నదియుక్తముకాదు.<br>రెండవయర్థము:—<br>ఈశ్వరుఁడు కరణవంతుఁడంటివేని వానికి సుఖదుఃఖాద్యనుభవము ప్రసక్తించుటవలన నట్లనరాదు. | కరణములన భోగసామ్యగతిప్రాప్తించున్॥ |
| | ౪౧॥ అంతవత్త్వమస ర్వజ్ఞతావా॥ | (ప్రధానపురుషు లనంతులైన చో)ఈశ్వరునకంత వత్త్వముగాని యసర్వజ్ఞత్వముగాని ప్రసక్తించును. | పరజీవాత్మ ప్రకృతుల।<br>పరిమితులింతింతయన్నఁ బ్రతినసమసి త।<br>త్పరున కనంతత్వము చెడుఁ।<br>బరిమాణ మెరుంగడన్న వాఁడజ్ఞుఁడగున్॥ |
| ౮॥ ఉత్పత్త్యధి॥ | ౪౨॥ ఉత్పత్త్య సంభవాత్॥ | (వాసుదేవ సంజ్ఞకుఁడైన పరమాత్మనుండి సంకర్షణ సంజ్ఞకుఁడైన జీవునియొక్క) ఉత్పత్తిసంభవింపమివలన (నీమతమ యుక్తము) | వ్యూహములు నాల్గువిధములు। (తం।<br>వ్యూహాద్యము వాసుదేవుఁడుత్తముఁ డా<br>డే హేతుద్వితయంబని। (ర్పన్॥<br>యయూ హింతురు భాగవతులు యుక్తి వలి |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | ౪౩॥ నచకర్తుఃకరణం॥ | కర్తయగు సంకర్షణునుండి ప్రద్యుమ్న సంజ్ఞికమగు మనస్సును బుట్టఁజాలదు | అలవాసుదేవువలనను।<br>వెలసెను సంకర్షణుఁడు వీనివలనసం।<br>ధిలె ప్రద్యుమ్నుండాతని।<br>వలనంగలిగె ననిరుద్ధ వాచ్యుఁడు సొరిదిన్॥ |
| | ౪౪॥ విజ్ఞానాదిభావే వాతదప్రతిషేధః॥ | వాసుదేవాదులు నలుగురును విజ్ఞానాదిశక్తులుకలవారని యంగీకరించినను, ఉత్పత్త్యసంభవమున కనిషేధత్వము కలుగుచున్నది (అనఁగాఁబూర్వోక్తదోషముదుర్వారము). | సంకర్షణాఖ్యజీవుం।<br>డంకురితుండయ్యె నాద్యునందని చెప్పన్।<br>బొంకగుఁదన్నిత్యత్వము।<br>శంకితమై మోక్షపదము సమకొనకుండున్॥<br>వరసంకర్షణ వాచ్యుఁడు।<br>కరణప్రద్యుమ్న[1] వాచ్యకార్యము సేయన్।<br>దరమె యుపకరణమెలయమి;।<br>నరయంగానిల్లె కలుగఁడనిరుద్ధుండున్[2]॥ |

(1) మనస్సు. (2) అహంకారము.

౪౫॥ విప్రతిషేధాచ్చ॥

(ఈపాంచరాత్రాగమ సిద్ధాంతముల యందు) పరస్పర విరోధము లుండుటవల నఁగూడ జీవోత్పత్తి వాదమసంగతము.

అర్థాంతరము:—(చతుర్వేదాధ్యయనమువలన మోక్ష ప్రాప్తి కాఁజాలదని యెంచి శాండిల్యముని యీపాంచరాత్రాగమము నధ్యయనము చేసెననుటచే) వేద నిందా దోషము వలనఁ గూడ నీ మతము నింద్యము.

ఓం తత్సత్.



ఈశ్వరులేనలువురు జ్ఞా। (యున్।
నైశ్వర్య బల ప్రముఖ గుణాఢ్యులు మఱి
శాశ్వతనిరధిష్ఠా(1)నుల।
నశ్వరులునటన్నస్వమతనాశముపొసఁగున్॥

(1) ప్రకృత్యజన్యులు.

# బ్రహ్మసూత్రార్థసంగ్రహము.

## ద్వితీయాధ్యాయము. తృతీయపాదము.

ఉ॥ ఖానిలకారకుం డభవుఁడగ్ని జలావనికారణం బభి।
ధ్యాన పురస్సరోద్గమ విధాతయునై ప్రతిలోమ ధోరణిన్।
లీనముఁ జేయు భూతముల లెస్సగ నే మహనీయుఁ డట్టి వి।
జ్ఞానఘనః ప్రణేత నది సన్నుతిఁ జేసెద మోక్షకాంక్షనై॥

ఉ॥ స్థావరజంగమాశ్రియత జన్మమృతి వ్యపదేశ మొందుచున్।
జీవుఁడు నిత్యమూర్తియయి చేతనుఁడంచుఁ బ్రసిద్ధిఁ గాంచినం।
భావితబుద్ధి తుల్య పరిమాణకుఁడై కృతికర్తనా ధరన్।
గోవిదతత్త్వవైఖరిఁ దగున్ బరువశ్యత వానియంశమై॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| ౧॥ వియదధి॥ | ౧॥ నవియదశ్రుతేః॥ | శ్రుతియం దాకాశోత్పత్తి వినఁబడక పోవుటవలన నాకాశ ముత్పన్నపదార్థము కాదు. | పొందిక గవియత్సృష్టిని।<br>ఛాందోగ్యము చెప్పకుంట జన్యం బదికా।<br>దందురుకాణాదులుఁ; జని। |

| | | |
|---|---|---|
| | | సందర్శశ్రుతియొకండు సమకుఱియున్నన్॥ ౧, ౨, ౪ సూ॥ |
| ౨॥ అస్తితు॥ | ఆకాశోత్పత్తిని జెప్పు శ్రుతియున్నది. కావున వియదనుత్పత్తి వాదముయుక్తము కాదు. | |
| ౩॥ గౌణ్యసంభవాత్॥ | ఆకాశోత్పత్తి కావశ్యకమగు కారణసామగ్రి సంభవింపక పోవుటవలన నాకాశోత్పత్తి శ్రుతిగౌణి. | సంభూతశ్రుతి గౌణియ। సంభవ మాకాశహేతు సామగ్రిగదా। సంభావనీయమగునా। సంభూతపదంబు బ్రహ్మశబ్దముభంగిన్॥ ౩, ౫, |
| ౪॥ శబ్దాచ్చ॥ | ఆకాశము నిత్యమని తెలుపు శ్రుతియుండుటవలనఁ గూడ నుత్పత్తిశ్రుతి గౌణార్థకము. | |
| ౫॥ స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్॥ | ఏకప్రకరణమందున్న బ్రహ్మశబ్దమునకు ముఖ్యార్థగౌణార్థములు సంభవించునటులనే, యేకప్రకరణమందున్న "సంభూ | |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | | త" శబ్దమునకును ముఖ్యార్థ గౌణార్థములు సంభవించును. | |
| | ౬॥ ప్రతిజ్ఞా౽హానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః॥ | వస్తుజాతమునకును బ్రహ్మమునకున భేదమువలనఁ బ్రతిజ్ఞా సిద్ధియగును కార్యకారణా వ్యతిరేకమును దెలుపు శ్రుతులవలన నీయభేదము సిద్ధమగుచున్నది. | ప్రతతవికారము బ్రహ్మ౽। వ్యతిరిక్తంబనుచు శబ్దమనుచుండుటచేఁ। బ్రతినక హానియగున్ దివి। యతిరిక్తంబనఁగఁ బ్రతినహానిఘటించున్॥ |
| | ౭॥ యావద్వికారంతు విభాగోలోకవత్॥ | ఆకాశమసంభవమను వాద మయుక్తము. ఏలననఁగా లోకమందువలెనే యెంత వరకుఁగార్యత్వమో యంతవరకువిభక్తత కన్పట్టుచున్నది. | సవికారపదార్థంబులు। సవిభాగములగుచు లోకసందృష్టములౌ। భువిదివిలోనగు వస్తులు। సవిభక్తములనుట బ్రహ్మ జన్యములను చేఁ॥ ఘట ఘటికోదంచనములు। కటకాంగద తాళపత్ర కరభూషణముల్। పటు ఫేనతరంగాదులు। |

| | | | |
|---|---|---|---|
| | | | స్ఫుటముగ స్వేతరవిభిన్నములుగా వెధరన్॥ |
| ౨॥ మాతరిశ్వవ్యాఖ్యానాధి॥ | ౮॥ ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః॥ | ఆకాశోత్పత్తి కథనము చేతనే వాయూత్పత్తియుఁ దెలుపఁబడెను. | గగనము జన్యంబనుటను।<br>గగనాశ్రయమైనయట్టి గంధవహంబున్।<br>దగుజన్యంబనఁ బడఁగా।<br>నగ రేనిత్యంబదన్న నయమెడలుటచేన్॥ |
| ౩॥ అసంభవాధి॥ | ౯॥ అసంభవస్తుసతోఽనుపపత్తేః॥ | సత్పదార్థము జన్యమనువాదమయుక్తము. దానికిఁ గారణాంతరోపపత్తి లేకుంటవలన నుత్పత్తి సంభవింపదు. | త్వంజాతః ప్రముఖశ్రుతి।<br>సంజాతత్వంబు దెలుపుసత్తున కనినన్।<br>రంజిలమి నన్యబీజము।<br>సంజనితత్వంబు కరమసంభవ మగుగా॥ |
| ౪॥ తేజోఽధి॥ | ౧౦॥ తేజోఽతస్తథాహ్యాహ॥ | వాయువువలన నగ్నిజన్మించెఁ గానిసాక్షాత్తుగ బ్రహ్మమునుండి కాదు. అటులనే కదా శ్రుతి తెలుపుచున్నది. | అనలంబు బ్రహ్మజన్యం।<br>బనిలానంతరము జన్మమెఱపొందెననన్।<br>జనివంచమి నిష్ఫలమై। (దున్॥<br>చను "వాయోరగ్నిః" యనెడుఛందః సం |
| ౫॥ అబధి॥ | ౧౧॥ ఆపః॥ | అగ్నివలన జలము జన్మించెను. అటులనేకదా శ్రుతి తెలుపుచున్నది:— పూర్వ | జలమునకు బ్రహ్మజత్వము।<br>జ్వలనభవత్వమును జెప్పుశబ్దములున్నన్। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | | సూత్రములోని పదము లింద ధ్యాహార్యములు. | జలమనలజ మేతచ్ఛ్రుతి। బలమున నవిసూత్రమ్మ దశను వైరముగనమిన్॥ |
| ౬॥ పృథివ్యధి॥ | ౧౨॥ పృథివ్యధికార రూప శబ్దాంతరేభ్యః॥ | మహాభూత ప్రకరణమువలనను, కృష్ణరూప కథనమువలనను, జలజన్యత్వమును జెప్పుశ్రుత్యంతరము వలనను, "తా అన్నమసృజంత" యనుచో నన్న శబ్దము చేఁ బృథివి వివక్షింపఁబడియె. | "అన్నమసృజంత" యనుచో। నన్న పదంబు పృథివీపదార్థముఁ దెల్పున్। జెన్నుఁగ బ్రకరణలింగ। సన్నతలఁ దెలుపదు భక్ష్యసామాన్యంబున్॥ |
| ౭॥ తదభిధ్యానాధి॥ | ౧౩॥ తదభిధ్యానాదేవ తు తల్లింగాత్సః॥ | వియదాదులు స్వవికారములను స్వయముగా సృష్టింపుచున్నవను వాదమనుచితము. ఉత్తరోత్తర భూతసృష్టినిగూర్చి సంకల్పము చెప్పఁబడుటవలనను, ఈశ్వరాధిష్ఠితములగు భూతములకే ప్రవృత్తి నిశ్రు | వియదాదిక భూతంబులు। (శ్రుతి॥ స్వయముగ స్వవికారములను సమకూర్ప ద్వియదాద్యభిమతేఁ బరుఁడు। (తుండై॥ య్యాయి కార్యమ్ముల సృజించు ధ్యానయుఁ |

| | | | |
|---|---|---|---|
| | | తి సూచింపుచుండుటవలనను, సృష్టిపరమే శ్వరకృతము. | |
| ౮॥ విపర్యయాధి॥ | ౧౪॥ విపర్యయేణతుక్ర మోఽత ఉపపద్య తేచ॥ | ఉత్పత్తిక్రమముకంటె వ్యత్యస్తముగా లయక్రమ ముపపన్నమగుచున్నది. ఇటుల నె శ్రుతియుఁజెప్పుచున్నది. కావునఁ బూర్వపక్షమయుక్తము. | పంచమహాభూతమ్ములు। కంచితముగ సృష్టిగతికి వ్యత్యస్తముగా। పంచత్వక్రమమొప్పును। జంచదనియతానులోమ సరణుల్వీగన్॥ |
| ౯॥ అంతరావిజ్ఞానాధి॥ | ౧౫॥ అంతరా విజ్ఞాన మనసీక్రమేణ తల్లింగాదితి చేన్నాఽవిశేషాత్॥ | ఆత్మకు నాకాశాదికమునకు నంతరాళమునఁ బ్రాణేంద్రియ విశిష్టమగుబుద్ధియు మనస్సును వరుసఁగాఁ బుట్టుచున్నవి; ఏలననఁగా నట్టిజన్మమునుసూచించుశ్రుతియున్నది; ఇట్లుంటివేని, భూతములకంటె నివి భిన్నవస్తువులు కాకపోవుటవలన నీవాదమయుక్తము. | పరునకు భూతములకు నంతరమునవిజ్ఞానచిత్త తత్వములొదవున్। వరుసఁగననసరిశాదవి। పరగన్ భూతావిశేష వస్తువులగుటన్॥ అలవిజ్ఞానమనస్సులు। పొలుచున భౌతికములన్న భూతక్రమనా। ళులుకాఁజాలునె యయ్యవి। పొలుపుగనాద్యంతమధ్యములనెటనున్నన్॥ |
| ౧౦॥ చరాచరవ్య | ౧౬॥ చరాచర వ్యపా | లోకప్రసిద్ధమగు జన్మమృత్యువ్యవహా | జననమృతి వ్యపదేశము। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| పాశ్రయాధి॥ | శ్రయస్తుస్యాత్తద్వ్యపదేశోభాక్తస్తద్భావభావిత్వాత్॥ | రము స్థావర జంగమ శరీరాశ్రయము. జీవుఁడు శరీరసద్భావాసద్భావములయందే జననమరణములను బొందువాఁడగుటవలన నావ్యవహారము గౌణము. కావుననది ముఖ్యమను పూర్వపక్షమయుక్తము. | జనును జరాచర శరీరసంబంధత జీ।<br>వునకున్, భాక్తంబయ్యెది।<br>తను భావాభావములను దనరారుటచేన్॥ |
| ౧౧॥ ఆత్మాధి॥ | ౧౭॥ నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః॥ | సృష్టిశ్రుతులయందు జీవోత్పత్తిశ్రవణము లేకుండుటవలనను, శ్రుతియందు నిత్యత్వశ్రవణముండుటవలనను జీవుఁడు జన్యుఁడుకాఁడు. | జీవోత్పత్తిశ్రవణా।<br>భావమునన్ నిత్య, జీవపరమాత్మాభే।<br>దావస్థానత్వ, శ్రుతి।<br>జీవుఁడు జన్యుండు నాఁగఁజెప్పందగునే॥ |
| ౧౨॥ జ్ఞాధి॥ | ౧౮॥ జ్ఞోఽతఏవ. | జీవుఁడ నుత్పన్నుఁడగుటవలననె వాఁడుజ్ఞానస్వరూపుఁడు. | జీవుఁడు నిత్యుండనుటన్।<br>భావించినజ్ఞాతయనని ప్రాప్తంబయ్యెన్।<br>జీవుఁడు బ్రహ్మానన్యుఁడు।<br>పావనచిన్మూర్తియల్ల బ్రహ్మంబుగదా॥ |

| | | | |
|---|---|---|---|
| ౧౩॥ ఉత్క్రాంతి గత్యాగత్యధి॥ | ౧౯॥ ఉత్క్రాంతిగత్యాగతీనామ్॥ | శరీరోత్క్రమణమునకును, లోకాంతరయాతాయాతములకును, వేదశ్రవణముండుటవలన జీవుఁ డణుపరిమాణుఁడు. | గత్యాగత్యుత్క్రాంతులు। ప్రత్యగ్రూపునకుఁ దెల్పు వాక్యములుంటన్। గత్యాగతులఁబరిచ్ఛే। ద్యత్వంబనివార్యమగుట నాత్మ యణుం డే॥ |
| | ౨౦॥ స్వాత్మనాచోత్తరయోః॥ | ఉత్క్రాంతి కుత్తరములగు గత్యాగతులకు స్వకర్తృతో సంబంధముండుటవలన జీవుఁడణు పరిమాణుఁడు. | |
| | ౨౧॥ నాణురతచ్ఛ్రుతేరితిచేన్నేతరాధికారాత్॥ | అణుత్వ విపరీతపరిమాణ శ్రుతియుండుటవలన జీవుఁడణు స్వరూపుఁడుకాఁడంటివేని, నిది బ్రహ్మప్రకరణమగుటవల నీవాద మనుచితము. | జీవవిభుత్వశ్రుతులా। యావిర్భూత స్వరూపు వ్యపదేశించున్। జీవాణుత్వోన్మాన। త్వావగతి శ్రుతులఁగతిని నాతఁడణుం డే॥ |
| | ౨౨॥ స్వశబ్దోన్మానాభ్యాంచ॥ | అణుత్వబోధక శబ్దము వలనను స్వల్పపరిమాణబోధక శబ్దము వలనను జీవుఁడణువు. | |
| | ౨౩॥ అవిరోధశ్చందన | చందన బిందు సుగంధము సకల దేహ | చందనబిందుసుగంధం। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము- | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | వత్॥ | హ్లాదకరమగునట్టుగ జీవుండు దేహైక దేశస్థుఁడైయును సర్వాంగోపలబ్ధిని బొందుచున్నాఁడు. | బందముగా దేహమంత నడరినగలిహ్వా। న్మందిరగతజీవుండును। బొందును దేహోపలబ్ధి పూర్ణప్రభతోన్॥ ౨౩, ౨౪ సూ॥ |
| | ౨౪॥ అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగమాద్ధృదిహి॥ | చందనబిందువునకు దేహమందేక దేశమాత్రస్థితి విశేషముంటువలన నట్టియవస్థితి విశేషములేని జీవునకుఁజందనదృష్టాంతము వర్తింపదంటివేని నది యుక్తముకాదు. హృద్దేశ నివాసత్వము జీవున కంగీకరింపఁబడెఁగదా. | |
| | ౨౫॥ గుణాద్వా లోకవత్॥ | లోకమందు మణిప్రదీపప్రభృతులవలెనె చైతన్యగుణవ్యాప్తి వలననైనను జీవునకు సకలదేహోపలబ్ధి సంభవించును. | చైతన్యగుణముస్వాయత। నేతరదేహమునఁగూడ నిరవారునుగం। ధాతిక్రమణమువలె; శ్రుతు। |

| | | |
|---|---|---|
| ౨౬॥ వ్యతిరేకో గంధవత్॥ | గంధమునకువలెనే గుణమునకు స్వాశ్రయవ్యతిరేక వృత్తి సంభవించుచున్నది. | లీలీరుననేకదా కథించెను బూడన్॥<br>౨౫, ౨౬, ౨౭, ౨౮ సూ॥ |
| ౨౭॥తథాచదర్శయతి॥ | జీవునకుఁ జైతన్యగుణమునుబట్టియే దేహవ్యాప్తి కలుగుచున్నట్లు శ్రుతియుఁ బ్రదర్శించుచున్నది. | |
| ౨౮॥ పృథగుపదేశాత్॥ | జీవుఁడునతని విజ్ఞానమును వేరుగ శ్రుతియుపదేశించుచుండుటవలన జీవుఁడణుపరిమాణుఁడు. | |
| ౨౯॥ తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్॥ | ఈవాదమయుక్తము. జీవాత్మ బుద్ధిగుణములను బ్రధానముగాఁ గలిగియుండుటవలనఁ బరమాత్మకువలెనే వానికణుత్వవ్యవహారము సిద్ధించుచున్నది. | ఈవాదంబగ్రాహ్యము।<br>జీవుఁడు బుద్ధిగుణసార చేష్టుండగుటన్।<br>భావింపఁబడియె నస్వా। (లేన్॥<br>స్వాభావికముగ వానికణుత ప్రాజ్ఞునకువ |
| ౩౦॥ యావదాత్మభావిత్వాచ్చనదోషస్తద్దర్శనాత్॥ | ఎంతవరకు బుద్ధిసంయోగమో యంతవరకుఁ బరమేశ్వరుఁడు జీవభావము కలవాఁడగుటవలనను, శ్రుతియిట్లు తెలుపుచుండుటవలనను, (వానికాకాలమున నసంసా | ఎందనుకబుద్ధియోగం।<br>బందనుకను బరుస కాత్మభావంబుంటన్।<br>బొందఁ డసంసారిత్వము।<br>పొందుగసుజ్ఞానసిద్ధి పొసఁగడుదనుకన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
|---|---|---|---|
| | | రిత్వము ప్రాప్తింపమిచే) దత్ప్రాప్తిరూప దోషము ప్రసక్తించుటలేదు. | |
| | 3౧॥ పుంస్త్వాదివత్త్వస్యసతోఽభివ్యక్తియోగాత్॥ | బాల్యాదులయం దనుపలభ్యములై బీజరూపములుగానున్న పుంస్త్వచిహ్నములు యావన కాలమున నావిర్భవించినట్లుగానె సుషుప్తిప్రళయములయందవిద్యమానమైశక్తిరూపముగనున్న బుద్ధి సంబంధము ను ప్రబోధప్రసవకాలములయందభివ్యక్తమగుచున్నది. కావునఁ బూర్వోక్త సిద్ధాంతము నిర్దుష్టము. | ప్రళయసుషుప్తులయందవి। రళగతిఁ దద్యోగముండి ప్రస్ఫుటగతితో। ఫలజనకోచితసమయం। బులయందావిర్భవించుఁ బుంస్త్వాదివలెన్॥ |
| | 3౨॥ నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసంగోఽన్యతరనియమోవా | అంతఃకరణము నంగీకరింపనిచో నాత్మేంద్రియములకు విషయోపలబ్ధ్యనుపలబ్ధులు సంతతముప్రసక్తించును. ఒండె నా | మనఆత్మేంద్రియసంమే। ళనమున విషయోపలబ్ధి లబ్ధంబగుఁ, గా। దననాత్మేంద్రియసం మే। |

| | | | |
|---|---|---|---|
| | న్యథా॥ | త్మేంద్రియములలో నొకదానికి శక్తిప్రతిబంధము ప్రసక్తించును. | శనమున నిత్యోపలబ్ధి లభ్యాసగుంగదా॥ |
| ౧౪॥ కర్త్రధి॥ | ౩౩॥ కర్తాశాస్త్రార్థవత్త్వాత్॥ | శాస్త్రము సార్థకమగుటచే జీవుఁడు కర్త (కర్తలేనిచోఁ గర్తవ్య ముపదేశింపఁబడదుగదా). | శారీరుండు కర్త యౌ శా। స్త్రార్థ సువిధినిషేధసార్థకతనుద। త్తైస్వైరవిహారశ్రుతులను। గారకసంగ్రహ విశేషకథనమువలనన్॥ ౩౩, ౩౪, ౩౫ సూ॥ |
| | ౩౪॥విహారోపదేశాత్॥ | స్వప్నమున జీవునకు స్వేచ్ఛా విహారముకలదని శ్రుతి తెలుపుచుండుటవలనజీవుఁడుకర్త. | |
| | ౩౫॥ ఉపాదానాత్॥ | (విజ్ఞానాది) కరణములను జీవుఁడుసంగ్రహింపుచున్నట్లు శ్రుతి తెలుపుచుండుటవలన జీవుఁడుకర్త. | |
| | ౩౬॥ వ్యపదేశాచ్చ క్రియాయాంనచేన్నిర్దేశవిపర్యయః॥ | లౌకికవైదిక క్రియలయందు విజ్ఞానమునకుఁ గర్తృత్వ వ్యపదేశముండుటవలన జీవుఁడుకర్త కాడంటివేని "విజ్ఞానంతనుతే" యనుచోఁ బ్రథమావిభక్తి ప్రయోగవ్యత్య | "విజ్ఞానంతనుతే" యని। విజ్ఞానపదంబు జీవువిజ్ఞాపించున్। విజ్ఞానమాత్రమునుగా। దజ్ఞతవచ్చెడి విభక్తివ్యత్యయమైనన్॥ |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహతాత్పర్యము. | అధికరణార్థకందమాల. |
| --- | --- | --- | --- |
| | | యము ప్రసక్తించును. (ఇచట విజ్ఞానపదమునకు జీవుఁడర్థముగాని బుద్ధికాదు). | |
| | ౩౭॥ ఉపలబ్ధివదనియమః॥ | ఇష్టానిష్టవస్త్వనుసారోపలబ్ధి యనియతముగానున్నట్లుగానె యిష్టానిష్టవస్తుప్రాప్తియు ననియతముగాఁగలుగును. | ఉపలబ్ధికర్త జీవుం। డుపలబ్ధులఁబొందు నాతఁడుపలంభకవ। స్తుపరత్వమునన్ దత్సి। ద్ధిపొసంగు ననియతసరణి తెల్లముగాఁగన్॥ |
| | ౩౮॥ శక్తివిపర్యయాత్॥ | బుద్ధిశక్తి యనఁగాఁ గరణత్వము వ్యత్యస్తమగును; (అనఁగాబుద్ధియేకర్తయగును). ఇదిసంభవింపదు గావునజీవుఁడేకర్త. | బుద్ధికిఁగర్తృత్వంబను। బద్ధంబనఁ గరణశక్తి వ్యత్యస్తంబౌ। బుద్ధికిసమాధ్యభావము। సిద్ధంబైయుంటఁ గర్త జీవుండెయగున్॥ |
| | ౩౯॥ సమాధ్యభావాచ్చ॥ | (బ్రహ్మసాక్షాత్కార ప్రయోజకమగు)నిష్ఠ (బుద్ధికిస్వతంత్రముగ) లేకపోవుటవలనను జీవుఁడేకర్త. | |

| | | | |
|---|---|---|---|
| ౧౫॥ తక్షాధి॥ | ౪౦॥ యథా చ తక్షో భయథా॥ | (కరణభావాభావములచే) వడ్రవాఁడు కర్తయు నకర్తయునుగా నెట్లు దృశ్యమగు చున్నాఁడో యటులనే జీవుఁడును దేహసంబంధా సంబంధములచేఁ గర్తయు నకర్త యనగుచున్నాఁడు. | వర్తించుఁ దక్షుఁ డెట్టులఁ। గర్తయకర్తయుననంగఁ గరణాపేక్షన్। వర్తించు జీవుఁడిటులనె। కర్తయకర్తయుననంగఁ గాయాపేక్షన్॥ |
| ౧౬॥ పరాయత్తాధి॥ | ౪౧॥ పరాత్తుతచ్ఛ్రుతేః॥ | జీవకర్తృత్వమీశ్వరనిరపేక్షకమనువాదమసంగతము. అది యీశ్వరాయత్తమని శ్రుతి తెలుపుచున్నది. | ఈయాపాధిక కర్తృత। స్వాయత్తము కాదదీశ్వరాయత్తముగా। నాయజ్ఞున కొదవును శ్రుతు। లీయర్థము నేకదా పఠించెనుబూడన్॥ |
| | ౪౨॥ కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధా వైయర్థ్యాదిభ్యః॥ | కారయితృత్వమునుబట్టి వైషమ్యనైర్ఘృణ్యాదోషములీశ్వరునకు లేవు. విధినిషేధశాస్త్రసార్థకతాదులవలన నతఁడు జీవకృతప్రయత్నా (కర్మా) పేక్షకలవాఁడు. | తతవిహితప్రతిషిద్ధ। ప్రతికూలత విషమసృష్టి బాధాదికమున్। హతములగు నీశుఁడాత్మసు। కృతప్రయత్నాద్యపేక్షఁ గేరునటన్నన్॥ |
| ౧౭॥ అంశాధి॥ | ౪౩॥ అంశో నానావ్యపదేశాదన్యథాచా | ద్రష్టవ్యత్వాది భేద నిర్దేశమువలన జీవుఁడీశ్వరాంశము; అభేదనిర్దేశమువలననై | ఈశాంశమె శారీరుం। డీశానన్యుండటన్న నీశాన్యుఁడనన్। |

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | పిదాశ కితవాదిత్వ మధీయతఏకే॥ | నను జీవుఁడీశ్వరాంశమే; ఇటులనేక దాయాథర్వణికులు బ్రహ్మమునకు దాశకితవాదిభావమును పఠింపుచున్నారు. | దాశకితవ దాసత్వము।<br>లాశాశ్వతునకు పఠింతురాథర్వణికుల్॥<br>జీవుండీశ్వరునంశమె।<br>పావకతద్విస్ఫులింగ భావముభంగిన్।<br>సేవక సేవ్యన్యాయము।<br>భావింపఁగఁ బొందుపడదు పరజీవులకున్॥<br>౪౩ సూ॥ |
| | ౪౪॥ మంత్రవర్ణాచ్చ॥ | మంత్రాక్షరములవలనను జీవుఁడీశ్వరాంశమే:—శ్రు॥ పాదోఽస్యసర్వాభూతాని॥ | భూతాదులు సర్వంబును।<br>శ్రోతవ్యని పాదమంచు శ్రుతులన్ భగవ।<br>ద్గీతలస్పష్టముగా నా।<br>ఖ్యాతంబయియుంట జీవుఁడంశుం డెసుడీ॥<br>౪౪, ౪౫ సూ॥ |
| | ౪౫॥ అపిచస్మర్యతే॥ | స్మృతియునిటులనె తెలుపుచున్నది:—గీత॥ మమైవాంశో జీవలోకే॥ | |

| | | |
|---|---|---|
| ౪౬॥ ప్రకాశాదివన్నైవం పరః॥ | జీవుఁడెటుల సంసారదుఃఖము ననుభవించుచున్నాఁడో యటుల నీశ్వరుఁడు సంసారదుఃఖము ననుభవించుటలేదు. ప్రకాశాంశము ఘటాద్యుపాధి సంబంధముచే వర్తులాది భావమును బొందినను బ్రకాశమంతయు నట్టిభావమును పొందదుగదా. | పరునంశముగా జీవుఁడు। పరగినఁదద్దుఃఖచయము పట్టదువానిన్। దరణిప్రకాశమొక్కెడ। నురువక్రంబయిన నంతయును నట్లగునే॥ |
| ౪౭॥ స్మరంతిచ. | ఇటులనే స్మృతికారులు స్మరింపు చున్నారు:—విష్ణు॥ నలిప్యతే ఫలైశ్చాపి పద్మపత్రమివాంభసా॥ | |
| ౪౮॥ అనుజ్ఞాపరిహారౌ దేహ సంబంధా జ్జ్యోతిరాదివత్॥ | శ్రౌతప్రేతాగ్న్యాదులయందువలెను పాధిసంబంధమును బట్టి విధినిషేధములు ప్రపన్నములగును. | శ్రౌతాగ్నిపరిగ్రాహ్యము। ప్రేతాగ్నినిషిద్ధమైన రీతి నుపాధిన్। హేతువుగాఁగానివర్తిలు। (1) స్మృతిస్మార్తాది విధినిషేధములరయన్॥ |
| ౪౯॥ అసంతతేశ్చావ్యతికరః॥ | జీవునకుసర్వశరీరసంబంధములేకపోవుట వలనఁ గర్మఫలసాంకర్యము సంభవింపదు. | కృతకర్మఫలంబులక। |

(1) శ్రౌతానుజ్ఞా నిషేధశాస్త్రంబులిలన్॥

| అధికరణములు. | సూత్రములు. | సంగ్రహ తాత్పర్యము. | అధికరణార్థ కందమాల. |
| --- | --- | --- | --- |
| | ౫౦॥ ఆభాసఏవచ॥ | జీవుఁడీశ్వరాభాసుఁడె (కాని యీశ్వరాంశుఁడుకాఁడని పరమసిద్ధాంతము.) | వ్యతికరమొప్పారునాత్మకఖిలమనోఽసం। తతిఁగే; నాతండీశ। (1) ప్రతిబింబాభాసమాత్రి భావుండెకదా॥ ౪౯, ౫౦ సూ॥ |
| | ౫౧॥ అదృష్టానియమాత్॥ | నైయాయిక మతమున నీయదృష్ట మీయాత్మదను నియమము లేకపోవుటవలనఁగర్మఫలసాంకర్యము కలుగును. | జీవాదృష్టంబులకును। జీవేచ్ఛాజ్ఞానములకు స్వీకృతనియమా। భావమునన్సర్వాంత। ర్భావమునన్ జీవకర్మ ఫలసంకరమౌ॥ |
| | ౫౨॥ అభిసంధ్యాదిష్వపిచైవం॥ | రాగద్వేషాదులయందుఁగూడ నిటుల నేనియమము లేదు. | |
| | ౫౩॥ ప్రదేశాదితి చేన్నాంతర్భావాత్॥ | దేహపరిచ్ఛేదమువలనఁ గర్మఫలవ్యతికరము కలుగదంటివేని, సర్వాత్మలును సర్వశరీరగతములగుటవలన నీదోష మనివార్యము. | |

ఓం తత్సత్.

(1) పా॥ భాసుండె॥

